Narayana Das, Azzada Adibhatla,

1864-1945

సారంగధర నాటకము

విజయనగరము, 1921

Record no. 501

Narayana Das, Azzada Adibhatla,

1864-1945

Sāraṅgadhara nāṭakamu

Vijayanagaramu, 1921

Record no. 501

**SUNDARAYYA VIGNANA KENDRAM**
**1-8-1/B/25/A, Bagh Lingampalli**
**Hyderabad – 500 044, Andhra Pradesh, India**

---

## Bibliographic Record Target

Narayana Das, Azzada Adibhatla, 1864-1945.
    సారంగధర నాటకము / శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాస విరచితము.- 1. కూర్పు.- విజయనగరము : శ్రీవేదవ్యాస ముద్రాక్షరశాల, 1921.
    123 p. ;18 cm.
Record no. 501

Narayana Das, Azzada Adibhatla, 1864-1945.
    Sāraṅgadhara nāṭakamu / Śrīmadajjāḍādibhaṭṭa Nārāyaṇadāsa viracitamu.- 1. kūrpu.- Vijayanagaramu : Śrīvēdavyāsa Mudrākṣaraśāla, 1921.
    123 p. ;18 cm.
Record no. 501

---

**35 mm microfilm**
**Image placement: IA (IIA) IB IIB**    **Date filming began:**

శ్రీరస్తు.

# సారంగధరనాటకము

1147

బ్రహ్మశ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాస

విరచితము.



మొదటికూర్పు 500 ప్రతులు.




విజయనగరము.

శ్రీవేదవ్యాసముద్రాక్షరశాలయందు ముద్రితము.

1921.

కాపీ రిజిష్టర్డు. పోస్టేజీకాక, వెల రు. 1-0-0.

## ఈనాటకమునందలి పాత్రములు.

పురుషులు.

1. రాజరాజనరేంద్రుడు — రాజు
2. మంత్రి
3. సారంగధరుడు — యువరాజు(కథానాయకుడు).
4. సుబుద్ధి — సారంగధరుని చెలికాడు(మంత్రికుమారుడు)
5. మహాకవిగాయకశిరోమణి.
6. పురోహితుడు
7. గిలిగింత — విదూషకుడు
8. గిజిగన్న — రంగులు వేయువాడు
9. జబ్బన్న — హంతకనాయకుడు

స్త్రీలు.

1. రత్నాంగి — రాజరాజనరేంద్రుని పెద్దభార్య. (కథానాయకునితల్లి)
2. చిత్రాంగి — రాజరాజనరేంద్రుని చిన్నభార్య (కథానాయిక)
3. వలనంత — రత్నాంగిదాసి
4. అంటెంత — చిత్రాంగిదాసి



శ్రీరస్తు.

# సారంగధర నాటకము.

## నాంది.

మ. తనువుం బెంచగఁ దల్లియై ధనములం ♦ దం జేయగం దండ్రియై
మనముం దిద్దగ నొజ్జయై సుఖములం ♦ బాలింప నిల్లాలునై
కొనసాగింపగఁ బుత్రుఁడై భయములం ♦ గొట్టంగ భూపాలుఁడై
యనయం బీశ్వరుఁడీసభాసదులఁ గ ♦ ల్యాణంబు లందిచ్చుతన్.

సూత్రి—(నాద్యంతమున తెఱప్రక్క చూచి) అమ్మాయీ!

నటి—(ప్రవేశించి) అయ్యా! సెలవేమి?

సూత్రి— కంటివా?

గీ. పగలు పలుతెఱఁగుల ♦ పనులందు డస్సిన
మనము సేదదేర్ప ♦ మనదు నాట్య
శాలయనెడు మంచి ♦ చలివేంద్రఁ జేరుని
జనుల వింతచవులఁ ♦ దనుపవలయు.

గీ. కంటివా! కాళిదాసాది ♦ కవుల నాటి
కములు నెల్లరు వినగ శ ♦ క్యములుకావు
కానఁ బసినాటనుండియు ♦ వీనుల కెఱు
కవడు తీయనిమాఁట ప ♦ ల్కవలె నిపుడు.

ఇదియునుం గాక.

ఉ. అద్దముఁబోలి యీజగమునం ♦ దతికిం గనువచ్చు తప్పులం
దిద్దుచు మంచివేర్పఁ గడు ♦ తీయని పాటలనించు వీనుల

గొద్ది ధనంబులోన సమ ♦ కూరెడు వంచిటు జూడవచ్చిరీ
పెద్ద లిక్కట్టినాటకము ♦ వీరికి వేడుకనేయ జాలెదుస్.

నటి — తమకింతయాలోచనమేల? వేఁడియొకగుచి క్రొత్త యొకవింత యనుసామెత తామెఱుఁగనిదా?

సూత్రి — ఔనౌ నిప్పటి కవులుచేసిన నాటకంబుల నొక మంచిదాని నేనెంచునంతలో నీవెద్దియైనం బాడి సభ్యులకు విందొనర్చుము. చూడు!

గీ. ఎండ యెక్కఁగొలఁది ♦ కొండయెక్కుడునట్టు
లెండ దిగుకొలఁది ♦ గొండ దిగిన
పోల్కిఁ గష్టసులభ ♦ ములజూపువైశాఖ
దినముఁ గూర్చి పాట ♦ దెలుపవలయు.

నటి — చిత్తము.

వసంత — చతురశ్రగతి.

సంతోసముగ వసంతమువచ్చెను — కంతునిబలమం — గనలన్ హెచ్చెను॥
చెలువుగమావిడి — చెట్టులుగాచెను — పొలుపుగనల్లెడ — మొల్లలుపూచెను॥
తుమ్మెదలలరులఁ — దొమ్మిగనాడెను — సమ్మదమునఁ బిక — సంఘముపాడెను॥
అనిలుఁడువీవన — లందునడాఁగెను — క్షణములపగిది నిశలు జనసాగెను॥

సూత్రి — ఓహో! నీగానాధికార మారాజరాజనరేంద్రుని మాటవలె సభను సద్దడగించెను.

(అని యిరువురు నిష్క్రమింతురు).

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# సారంగధరనాటకము.

## ప్రథమాంకము.

[రాజరాజనరేంద్రుని కొల్వుకూటము.]

(ప్రవేశము — రాజు, మంత్రి, కవి, విదూషకాది పరివారముతో.)

రాజు — నేడికొల్వుకూటముంజూడఁగనదేమో క్రొత్త యుల్లాసమగుచుండెను. మంత్రీ!

మంత్రి — ప్రభువుల నాశ్రితులం జూచునపు డుల్లాసము గలుగుట సహజమేకదా!

కవి — ఆశ్రితుల కేలికసందర్శన మంభోజములకు సూర్య ప్రకాశము.

రాజు — మహాకవిగాయకశిరోమణీ! నమస్కారము.

కవి —

గీ. ఆశ్రితులపాల దాక్షిణ్య ♦ మరులయొద్ద
శౌర్యముం గోవిదులచెంత ♦ సాత్వికతయు
నెసఁగు నేలినవారిక ♦ భీష్టజయము
లిచ్చుఁగావుత సంతత ♦ మీశ్వరుండు.

రాజు — మంత్రీ! ఈయేడు మనరాజ్యమెట్లు ఫలించెను? కాపు లెట్లున్నవారలు ?

మం—— సకలధర్మస్వరూపులయిన తాము రాజ్య మొసర్ప నెవ్వానికప్పటికి నేయేలోప మైననుండనేరదు. నవధాన్యములును సమృద్ధిగ ఫలించినవి. కొబ్బరి, మావి, పోక మొదలగువృక్షజాతులు, ప్రత్తి, నీలి మొదలగు సస్యములు మెండుగఁబండినవి. కాలోపయోగముగ వర్షములు గురియుటచే నేరోగంబులందగులక ప్రజాభివృద్ధియుం బశువృద్ధియునగుచున్నది. కాఁపులందఱు నేలికకటాక్షంబున సుముఖులై వ్యవసాయములనభివృద్ధిసేయుచున్నారు.

రాజు—— మాతపస్సిల్లవుడును మారాజ్యము సమృద్ధిగఫలింపవలెననియును, మాప్రజలెల్లరును హాయిగనుండవలెననియునుగదా ?

మం—— చిత్తము. స్వదేశప్రజలయం దేలికకుఁగల ప్రేమ లోకనిఖ్యాతమే ? యేలనన ? ఏలినవారెన్నఁడుం బైరాజ్యంబులం జేరి ధనము వ్యయపర్చలేదు, ఇచటివారింగాదని విదేశీయులకు సొమ్ముకొల్లబెట్టలేదు. సంతతమేలినవారిసమక్షమందుఁగలమాబోఁటి ముఖ్యసేవకులందుఁ దమకుఁగటాక్షముండుటవింత కాదుగాని, కాఁపులు మొదలుకొని యీరాజ్యమునందలి యెల్లయితర ప్రజలనుఁ బేర్వేర్ తాముదెలిసికొని కాపాడుచుంట యత్యద్భుతముగనన్యదేశస్థులుగూడఁ జెప్పుకొనుచున్నారు.

రాజు—— సంతోషము. (కవిదెసచూచి) కవికులమణీ!



మన విద్యాపాఠశాల లెట్లున్నవి ?

కవి——

సీ. కనిపెట్టినారు నూ ♦ తన దేశములను న
క్షత్రంబులం గోళ ♦ శాస్త్రవిదులు,
కనిపెట్టినారు నూ ♦ తన మూలికాలోహ
చయగుణముల వైద్య ♦ శాస్త్రవిదులు,
కనిపెట్టినారు నూ ♦ తన యంత్రసామగ్రి
జనహితంబుగ శిల్ప ♦ శాస్త్రవిదులు,
కనిపెట్టినారు నూ ♦ తన భాష్యముల వేద
సమితికెల్లను శబ్ద ♦ శాస్త్రవిదులు,
శాస్త్రముల నన్యదేశ భా ♦ షలఁబురాణ
ములనుఁ దెనిగించుచుండ్రి, క ♦ వులును వింత
కావ్యములఁ, జరితలఁ, గ్రొత్త ♦ కథల, నాట
కముల, నగణితముగఁ గల్ప ♦ నములఁజేసి.

రాజు—— ఓహో! జ్ఞాపకమునకు వచ్చినది. చిరంజీవి సారంగధరుఁడు సంగీతమందేగాక కవిత్వమునందుఁగూడ నెక్కుడు ప్రజ్ఞకలవాఁడని తెలియవచ్చెను.

కవి——

గీ. స[illegible]త్వ ♦ సంపదయును,
[illegible] ♦ దార్యములును,
చక్కదనము స్వతంత్ర[illegible] ♦ జ్యంబునొప్పు,
బరగు గాకేఁడి? సారంగ ♦ ధరుఁడు దక్క.

రాజు—— తొల్లిసంతానములేక చింతలంబొంది యెంతయో

శపంబు సలిపి తుదకుఁ బరమేశ్వరుకరుణచే నేనిబ్బాలకునిఁ గాంచుట మీకెల్లరకుఁ దెల్లమేకదా ?

మం— మహాప్రభూ ! అదినిజము. ఇంతేగాక, చిరంజీవి సారంగధరునకును, నాబిడ్డఁడగు సుబుద్ధికిని మిగులస్నేహము గలుగుటచే, యువరాజసుగుణములను నాపుత్రునిముఖంబునఁ బ్రతిదినము వీనులవిందుగ వినుచుందును. మరియు, సత్యవచోనిధులని ప్రసిద్ధిగన్న ధర్మరాజుగారుంగూడ "నశ్వత్థామ హతః" అని కార్యార్థులై యసత్యసూచనఁజేసి 'కుంజరః' అని సద్దుకొనిరిగాని, యీశ్వరవరజనితుఁడగు సారంగధరుఁ డొకప్పుడును గల్లవలికినట్లు వినలేదు.

రాజు— యెవఁడురా ! యక్కడ?

ద్వారపాలకుఁడు— (ప్రవేశించి) మహాప్రభూ !

రాజు— ఓరీ ! చిరంజీవి సారంగధరుని, సుబుద్ధిని వేగముగాఁ దోడుకొనిరమ్ము.

ద్వార— చిత్తము. (అని నిష్క్రమించును.)

రాజు— మహాకవిగాయకశిరోమణీ ! తాముసహజసంగీతకవితావిశారదులగుటవలనఁగదా నెచ్చెలికాండ్రగునాబాలురకీవిద్యలందంతగాఁ బ్రావీణ్యము కుదిరెను. చిరకాలమునుండి నాకొక సందియమున్నది. సంస్కృతాంధ్రములంగూలంకషముగఁ దెలిసినతామెట్లు చెప్పెదరో ? మార్దవంబున నేభాష యెక్కుడు ?

కవి— దేవా ! ఇదియొక సందియమా ?

గీ. మొలక లేఁతదనము, • దలిరుల నవకంబు,
మొగ్గ సోగదనము, • పువ్వుఁ దావి,
తేనె తీయదనము, • తెనుగునకే కాని
పరుష సంస్కృతాఖ్య • భాషకేది ?



రాజు— ఔను ! తెనుగునకు స్త్రీలాలిత్యము, సంస్కృతమునకు పురుష గభీరతయు సహజములు.

(సారంగధరుడు, సుబుద్ధియు ప్రవేశింతురు.)

సారం— ఏలినవారికి నమస్కారము.

రాజు— చిరంజీవ.

సుబు— ఏలినవారికి నమస్కారము.

రాజు— చిరంజీవ.

సారం— గురుశిరోమణీ ! అభివాదనము.

కవి— చిరంజీవ.

సుబు— గురుశిరోమణీ ! నమస్కారము.

కవి— చిరంజీవ.

రాజు— కూర్చుండుఁడు.

(సారం- సుబు- చిత్తము. అని యట్లుచేయుదురు.)

గిలి— చిత్తము. అట్లు, అప్పచ్చి, గారె, బూరె, లెండు. నేదగ్గరగూర్చుండవలెను. రాజుగారియొద్ద నందఱికన్న మొదటిమన్నన నాది, నాకుక్కపిల్లదీ ?

కవి—

గీ. ఔను, గిలిగింత ! లక్షల • నందుకొనియుఁ,
దప్పి దీఱని మాకన్న • దొప్పెడంత

మాటితోఁ బుష్టిపొందు ని ♦ కుక్కపిల్ల
కును, మఱియునీకు, నొసటిను ♦ న్నవలుతగవె ?

రాజు— బాగుగా సెలవిచ్చితిరి. (సారంగధర, సుబుద్ధులనుజూచి) మీపాటవినిచిరకాలమయినది. మీరెనిమిదేండ్లబుడుతలై యున్నప్పుడువింటిని. ఇపుడెంతయభివృద్ధినొందియుండునో? కనఁగూర్చి పాడి నొనర్పుడు.

గిలి— రెండు. మీరుపాట నాకుక్కపిల్లయాట.

సారం—సుబు—

శంకరాభరణము—ఏకతాళము.

ప॥ ఏలినవారి పాలనమున - నెల్లజనులు మనుచుండిరి సుఖమున।
అ॥ కాలయోగ్యమయివానలుగురియును-గ్రామజాతరకనులపండువై॥యే॥
౧. చిచ్చరగాండ్రు మఱి బీదలులేరు - పచ్చెపుసనముగపడెదచోట్ల
పచ్చిక బయలంబు పశువులు నిండెను - హెచ్చుఫలవృక్షము లెల్లయు
బండెను॥ యేలి॥

కవి—

గీ. చిన్నతాతదారమీపాట ♦ చిన్నముద్దు
లేవిపట్టులు, జొన్నల ♦ నెగచినట్లు,
పన్న, చెంబేలి, జాజులు ♦ జల్లినట్లు
చిన్నిపూఁదేనె పయిఁబయిఁ ♦ జిందినట్లు.

గిలి— నాకుక్కపిల్లయాడి యలసినది.

సారం— యెత్తుకొనుము.

గిలి— ధర్మరాజుగారంతటివారే స్వర్గమునకుఁబోవునప్పుడు సయితము కుక్కందలనెక్కించుకొనగా నేనెత్తుకున్న తప్పా?



కవీశ్వరుఁడుగారూ! పాక్షికము సేసెదరా? నాకుక్కపిల్లయాటనుఁగూడ వర్ణించరా?

కవి—

గీ. కుక్కపిల్లరో నీయాట ♦ చక్కదనము
నెగడు రబ్బరుచే బంతి ♦ యెగురునట్లు
ఊడుకు నన్నముపై సిబ్బి ♦ పడఁకునట్లు
కుడితిలోఁబడ్డ యెలుకద్రు ♦ ళ్ళిడినయట్లు.

రాజు— అయ్యా! వీరికికవిత్వమునందాసుధార యెట్లుండునోచూడవలయును. ఎద్దియైననొక సమస్యనిచ్చి పూర్తిసేయుమనుఁడు?

కవి—

గీ. కవితమెట్టల రావలెఁ ♦ గలుపుఁ దన్న

సుబు—

సాఁగి కమ్మచ్చునవచ్చు ♦ తీఁగెఁబోలి

సారం—

సాలెపురుగు కడుపులోని ♦ నూలుఁబోలి

గిలి— నేనుంబూర్తిసేయుదునా?

రాజు— కానిమ్ము.

గిలి— కొట్టకకదా?

రాజు— భయములేదు.

పడిసెముహుహుహు హుహుహుహుహూ ♦ పపహాహాహా.

రాజు— కవిత్వమునకుఁ బ్రాణముఖ్యముగదా?

ద్వార— (ప్రవేశించి) మహాప్రభూ! యేలినవారి సందర్శనమునకుఁ జెంచువాండ్రు వచ్చియున్నారు.

రాజు— రమ్మను.

ద్వార— చిత్తము మహాప్రభూ. (నిష్క్రమించును).

మంత్రి— యేలినవారిని వేటకై పిల్వవచ్చిరికాఁబోలు?

రాజు— మాకుఁగూడనట్లేతోఁచెను. వేటాడిచిరకాలమైనది. నగర కృత్రిమములకన్న వనగిరిసహజములు రమ్యములుగదా?

కవి—

సీ. ఎండమఁ జొరనీక ♦ యెదిగి బల్లులుదుగ
నల్లుకొన్నట్టి వి ♦ దుశ్శృపొదలు
కొండలఁబోలెడు ♦ బెండులై తేలిమ
డుఁగుల నీఁదాడునే ♦ నుఁగ కదుపులు

రాజు— (సారంగధరసుబుద్ధులనుచూచి) తక్కినచరణములను మీరిద్దఱుం బూర్తిసేయుఁడు?

సుబు—

మేసులుబ్బఁగనెల ♦ మ్రింగి లావగుచెట్లు
కుంజొట్టు కొన్నట్టి ♦ పెంజిలువలు

సారం—

తోడనె బండరాల్ ♦ దొర్లించుకొనుచు గ
ట్టు దిగువకుం ద్రుళ్ళెడు ♦ సెలయేళ్లు

కవి—

గలఁగు కాఱడవులలోనఁ ♦ గాపురంబు



బఱపుచుఁ బులుల లేఁగలఁ ♦ బగిది నిరష్ట
గట్టినైచుచుఁగలనైనఁ ♦ గల్లవలుకఁ
బోని యెఱుకలఁబోడగన్నఁ ♦ బున్నెమబ్బు.

మంత్రి— మహాప్రభూ! అరుగో! పిల్లనగ్రోవుల నూఁదుకొనుచు దలలపైఁ బలురకముల పిట్టఱెక్కలకుచ్చు లల్లాడ నెద్దియో పాడుచునాడుచుఁ జెంచువాండ్రిటకు వచ్చుచున్నారు.

(చెంచునాయకుఁడు భార్యయగు సింగితోఁ బ్రవేశించును).

బేహాగ్—త్రిశ్రగతి.

ప॥ నోరనుజూడఁ గలిగెసింగి - దోసములఁ దొలంగి।
అ॥ గరుపారిన మేనుపొంగి - కనులపండువై చెలంగి॥ దో॥
౧. పున్నమచందురునిమాడ్కిఁ - బోలునీతని మోము।
కన్నులంచు నెనరుచిందు - కడింది జగజెట్టియైన॥ దో॥

రాజు— కనికరమా చిన్నదియలసినట్లు కాన్పించుచున్నది యాటచాలించుఁ డలసటదీర్చుకొనుఁడు.

కవి—

గీ. చీర సింగారము న్వింత ♦ సిగ్గు లోర
చూపు లొయ్యారపునడలు ♦ సోయగఁపు
మాటలున్ గాణివాసంపు ♦ గోఁటులేక
పుట్టుచక్కదనమె చెంచు ♦ బోండ్లకలరె.

చెంచునా— మమ్మేలెటితియ్యనిసామీ! మాపాలిటివేలుపా! నీయడుగుల మొక్కెదనాసింగినిన్ను దీవించి కాపాడుమాయప్పా! నీబిడ్డలముసుమ్మి.

రాజు—నీవు, నీబిడ్డలు, నీచుట్టములు హాయిగనున్నారా? మీయడవులు బాగుగఁబండినవా? మఱేమివింతలు?

చెంచునా— సామీ! అడవు లీయేఁడన్నిపంటలుఁబండినవి. నీబిడ్డలందఱు హాయిగనున్నారు. పండ్లివె, తేనెయిదెపుచ్చుకొండు. మా వేల్పా! ఈయేటివింతలు బిడ్డఁడను మనవిచేసికొనెదను. కారుదున్నలు, గొరబోతులు, దుప్పులు, పులులు, పందులు క్రొవ్విచెలరేఁగి మాపంటచేలంబడి చెఱచుచున్నవి. వేటాడరండు మాయేలికా!

రాజు— సంతోషము. మీకోర్కెచొప్పునఁదప్పక వేటకు వచ్చెదము.

చెంచునా— బిడ్డఁడను, మ్రొక్కెదనుసామీ! సెలవిమ్ము.

రాజు— మంచిది.

సింగి— నీబిడ్డను సెలవిమ్ము. సామీ!

రాజు— చెంచెతా! నీకేమికావలయునో కోరుకొనుము.

సింగి— మాయప్పా! మా వేలుపా! నాచోడిగాఁడు వీఁడు చల్లగనుండ దీవించు సామీ!

రాజు— మంచిది.

(చెంచువాండ్రు నిష్క్రమింతురు.)

రాజు — మహాకవిగాయకశిరోమణీ! చూచితిరా? కనికరమెంత స్వల్పసంతుష్టిరో? యా చెంచెత కోరినభాగ్యమంతయునుఁ దనభర్తయొక్క క్షేమమేయట?



మంత్రి— ఇక్కడివారి నెవరినైన నేలినవారు కోరుకొమ్మనినచో నించుమించుగా నేలికగద్దియనే యడిగెదరు.

కవి—

గీ. ఏమి భృత్యత సంతుష్టి ♦ యెంతనయము
నమ్మకంబెంత సాధువి ♦ నయమునెంత
దోసమెఱుఁగని యిక్కిరా ♦ తులనుఁజూచి
బూటకపునాగరులు సిగ్గు ♦ పొందవచ్చు.

మంత్రి— ఓరిగిలిగింతా! ఏమాయల్లర? ఎందుకట్లుకడుపుబాఁదుకొనెదవు?

గిలి— ప్రభువంటివారుసహితము వేళమించియు నాఁకలి మఱచియుండఁగా నిప్పాడుకడుపునకెక్కడి యాఁకలివచ్చినది?

రాజు—బాగుగజ్ఞాపకమునకుఁదెచ్చితివి. ఇప్పుడెంత వేళ?

కవి—

ఉ. వేవవిపొద్దు నట్టనడి ♦ విమ్మనినిల్చెడి యెండ నిప్పుగాఁ
జేసెడు మేనినీడ కడుఁ ♦ జిన్నఁగఁదగ్గి యడుంగు చెంతకున్
జూపెడుఁ జెట్లతోఁజిలుల ♦ డంగి దగంబడి పిట్టలెల్లెడన్
గూసెడు రెండుజాములది ♦ గోగడియారము కేకవేసెడున్.

గిలి— నాపద్యము వినరా?

రాజు— కానీ.

గిలి— కానియున్న నిదివఱకు సెనగలైనకొని మెక్కఁగాఁదునా? చూడుఁడు.

గీ. పొట్ట వెన్నంటినది చచ్చి ♦ బువ్వ యరిగె
నోరు తాలింపుపసివట్టె ♦ యూరుచుండె
వేఁడిగాడ్పులు చెవులందు ♦ వెడలఁజొచ్చె
ఇంకమీరలు లేవరే ♦ నేమిసేతు.

రాజు— మంత్రీ! వేఁటకై ప్రయాణపు ప్రయత్నములఁ జేయుము. ఇంకమాధ్యాహ్నికక్రియల కరుగుదము.

(అందఱును నిష్క్రమింతురు.)

ప్రథమాంకము.

సమాప్తము.





శ్రీరస్తు.

# సారంగధర నాటకము.

## ద్వితీయాంకము.

[ఉద్యానవనాంతర్గత సౌధము.]

(ప్రవేశము:— సారంగధరసుబుద్ధులు గిలిగింతతో.)

సారం— నేస్తమా!

గీ. అడుగులన్ మోములందుఁ, గెం ♦ పలరుచుండఁ
జెల్లఁ బురివిచ్చి యందియల్ ♦ ఘల్లనంగ
మెడనుఁ బైకెత్తి యింపుగ ♦ నడచుచుండె
నాఁడ రాయంచపావుర ♦ మదిగొ చూడు.

సుబు— అయ్యా! చిత్తగించితిరా? యీగోధుమవన్నె మగపావురము మాటిమాటికిఁ దన కవపిట్టఱెక్కలందుఁ దన ఱెక్కలం జొనుపుచు దానినోటికి గింజలేఱియందించుచుఁ జిందులుద్రొక్కు చెట్లు వేడుక చేయుచున్నదో?

గిలి— మీదిమగది, మీదియాఁడుది. నాది యుందున కిందునకు నడిమిదానివలెఁ గన్పడుచున్నది. పెట్టం జేరదు. పుంజుం గవగూడదు.

సారం— నీదేసరి నపుంసకలింగమా గిలిగింతా యథేచ్ఛగానన్ని తావులంజరింపఁగలవు. స్త్రీలునిన్నుఁజూచిసిగ్గునొందనక్కఱలేదు. మగవాండ్రు నీపైమీసముదువ్వనక్కఱలేదు.

గిలి— గబ్బిలమువంటిది నాబ్రతుకు. పిట్టలలోఁబిట్టను. మృగములలో మృగమును.

సారం— ఏమోయి నేస్తమా! మనకోడె డింకీపావురమెగిరించి వేడుకచూతుమా?

సుబు— చిత్తము గాని, క్రొత్తపెంపుడుపిట్టపైకి బాఱిపోవునేమో?

గిలి— దానికిఁ బెట్టయెక్కడనైన నగపడినదో మఱిమీయొద్దకు రాదు కాఁబోలు సుండీ?

సారం— సార్ఙంగధరుని పుంజునకట్టి కక్కుఱితి గలుగనేరదు. నేస్తమా! దీనినెగురవైచెద చూడుము.

గీ. గాలికెదురుగఁ జనగఱె ♦ క్కలు విదలుచు
గాలితోడను పోవఁగఁ ♦ గదలకుండు
ఏటికెగువ దిగువలందు ♦ నీఁదునట్లు
పాఱుచున్నది నాముద్దు ♦ పావురంబు.

సుబు— అదిగో? నాపావురమిప్పటికి తమపావురము దఁజేరినది. రెండునునొకదానివెంటనొకటి చక్రాకారంబుగఁదిరుగుచున్నవి.

గిలి— నాపావురము నావలె నాఁకలికూటిదికాఁబోలు నెంతయెగురవైచిననెగురక గింజలనేఱుకొనితినుచున్నది.



సుబు— అద్దె! నాపావురము మొగ్గలువైచుచిటుకు దిగివచ్చుచున్నది.

సారం— ఓయీ! అదేమోకాని నాపావురమునకింకను దిగుటకు మనసుపుట్టక మిన్నందుచు నరుంధతివలె నగపడీయగపడకున్నది. ఎప్పటికివచ్చునోకదా? నీకగపడుచున్నదా?

సుబు— యీ పాపపుభూమిం జేరనొల్లక స్వర్గంబున కరుగుచున్నట్లు తోఁచెడును.

గిలి— నాపావురముసరి. దీనికి స్వర్గనరకములు రెండును నక్కఱలేదు. హాయిగ మెక్కుచున్నది.

సుబు— సోమరిపోతున కింతకన్న పనియేమి?

సారం— నేస్తమా! ఇదిగో! నీపిట్ట క్రిందికిఁజేరవచ్చినది. ఆహా! నాపావురమెప్పటికి వచ్చునో? నాకేమియుం దోఁచకున్నది? ఎంతచూచిన నగపడదు? గాలి దాని నెటువైపునకుఁద్రోసెనో? గాక యేదైననొక పాడుగద్ద దానిని వెంబడించెనో? అయ్యో! నాముద్దులపావురమా!

సుబు— అయ్యా! చింతించెద రేల? నిముసమునకో క్షణమునకో దిగివచ్చును.

గిలి— అగపడకపోవలె? రాకపోవలె? దేవుఁడా! అదిరానియెడల నీకొక ముష్టిముంతమీఁదుకట్టెదను?

సుబు— అదిరాకున్న నీకేమి లాభమురా?

గిలి— ఏమిలాభమా? దానిబంగరుగూటికెనిర్భయముగ నా

పావురమధికారము నొందవచ్చుగదా ? మీఁది యుద్యోగిపని క్రిందివాఁడు కోరఁడా?

సారం— ఓరీ గిలిగింతా ! నీకు నవ్వుగనున్నదికాని నాపావురముపయినా కెంతయాసగనున్నదో నీకుఁదెలియునా? దానిపై నేఁ బ్రాణముంగూడఁ బెట్టెదను. (సుబుద్ధివైపుచూచి) నేస్తమా! యేమి ? దానిజాడయైనం బొడకట్టదా?

గీ. తలను ద్రేళ్ళనదుమఁ ♦ దనరఁద్రిప్పుచునాడు
చేతిలోన వెల్ల ♦ చిఱుఁగుమాలు
పగిదినుందు వెపుడు ♦ పావురమా నన్ను
నెడయ నీకు నెక్క ♦ లెట్టులాడె.

గీ. చలిదియైనఁ గుడువఁ ♦ పాలుత నీకాహార
మిడక నిద్దురనైన ♦ నీవు కనులఁ
గట్టుచుందు విట్టి ♦ ఋట్టదారునిఁ బాసి
పాతిపోవఁ దగునె ♦ పావురంబ.

ఏమిసేయుదును ? దారిలోసొమ్ముకొల్లవోయినవానితెఱంగున రిత్తచేతుల నింటికెట్లేగుదును ?

గిలి— మాచిన్నప్రభువువారికెల్లపుడు నొకచేతపుస్తకము వేఱొకచేత బారువము నుండుచువచ్చెను. ఇప్పుడు పావురము కట్లాల్లవిస్త్రిపలె పాఱిపోయెను. ఇకఁమీఁదనీవిచారముచేఁబ్రభువారు పుస్తకముంగూడఁబట్టక వారు సెలవిచ్చినట్లురిత్తచేతులతోఁజుల్కబడి యాటవిడుపిచ్చినబడిపిల్లనివలెహాయిగఁదిరుగుచుందురు.



సారం— ఓరీ! శనివలె నీవెక్కడపోయైతివి ? నోరుమూసికొనుము. (సుబుద్ధినిచూచి) నేస్తమా ! నలుదట్లుపరికించుచున్నావా ? యెందైననగపడలేదా ?

సుబు— అయ్యా ! చిత్తగించుఁడు.(వ్రేలితోఁజూపుచు) మీపావురమావైపునకుఁ జుక్కవలె దిగుచున్నది.

సారం— (చూచి చప్పట్లుచఱచుచు) హద్దీ ! జౌనౌను ? నేస్తమా! నాపావురము నాకగపరచినందులకుఁ గోరుకొనుమెద్దియైననిచ్చెదను ?

సుబు— ఏలినవారి కటాక్షముండినఁజాలును. నాకేకోరికయును లేదు.

గిలి— ఏడుకొండల తిరుపతివెంకన్నకొక బోడిరాగిచెంబు మీఁదుకట్టినాను. ముడుపుచెల్లించవలయుఁజుండీ.

సారం— నేస్తమా ! అదియెక్కడ దిగుచున్నదో కనిపెట్టవలెనుసుమా ?

సుబు— (ఆకసమునంకచూచి)అన్నా! మీపినతల్లిచిత్రాంగిదేవిగారి మేడపైకొఱగుచున్నది.

గిలి— చేతగలరూక నూఁతఁబడినట్లు ?

సారం— నేస్తమా ! యాపావురమును దీసికొనినచ్చుటకీ నపుంసకలింగమునుఁ బంపింతమా?

సుబు— చిత్తము.

సారం— ఓరీ !

గిలి— తాముచదుకొన్నవారుకదా ? ఓరీ! యేలింగము ?

సుబు— ఓరీ కాకోసీ యనవలెనాయేమి ?

గిలి— ఇద్దఱికిద్దఱే? ఇదేనా మీరుచదివిన వ్యాకరణము ? ఓరీమోసులకుమధ్యగానన్నుఁబిలిచినందప్పనేఁబలుకనేపలుకను.

సారం— ఇఁకనవ్వులుచాలించిమా పినతల్లి—

గిలి— మాపినతల్లి.

సారం— (కోపముతో) నాకలుక వచ్చుచున్నదిసుమా ? భద్రము. అడ్డెడ్డమనఁ దెడ్డెడ్డమని కన్నుగానక వదరఁబోకు. నీవు త్వరమేగి నానమస్కారములు మనవిచేసి తమకొడుకుసారంగధరుని పావురము తమమేడచెంత వ్రాలినది. దానింబట్టించి దయచేసి పంపించవలెననినామనవిచెప్పి పావురమును ద్వరగాఁదీసికొనిరమ్ము. పొమ్ము. మేమీప్రాంతముననే నీకొఱకెదురుచూచుచుందుము.

(అని ముగ్వురు నిష్క్రమింతురు.)

[స్థలము= చిత్రాంగిమేడలో నొకప్రదేశము.]

(అంటింత పాడుచుండును)

చిత్రాం— (ప్రవేశించి) సేవనక్కఱలేదు కూర్చుండుము. ఏదేదీ? అంటింతా ! ఎంతచక్కనిపాట పాడుచున్నావు ? మఱియొకసారిపాడుము?

అంటి— నాపాటబాగుగలేదని కాంభోలు నమ్మగారు హాస్యముచేయుచున్నారు ? నేర్చుకొన్నది కాదుకదా !



చిత్రాం— వలపు, పాటయును వానియంతట నవియేకలుగవలెనుగాని యొరులుమప్పిన నేపాటివచ్చును? బలిమిపెట్టి నేర్పినపాట, బలిమిపెట్టి చేసిన పెండ్లివలెఁ దిన్నపడనేరదు. కాని యేదీ ? నీవిప్పుడు పాడుచున్నపాట ? వినుట కెంతో ముచ్చటగానున్నది.

అంటి— చిత్తము.

భైరవి — అటచాపు.

ప. ఈడు కుదిరిన వన్నె - కాఁడు దొరుకకున్నఁ।
జేడెజవ్వన మేటికే - ముమ్మాటికే॥
అ. వాఁడి పయనుదీరఁ - గూడలేని మది।
వాఁడు మగఁడైన - వాఁడుదెట్లు సయిచు॥ ఈడు॥

ఇంతవఱకే నాకువచ్చు నీముక్క నేనెక్కడనో వింటిని. ఒకగడియక్రిందట నేనిక్కడకువచ్చుచుండఁగాఁగోటముంగలఁబారువములు నెగరించుచున్న యొక నవమన్మథునింజూచినామగనుక నిపుడునాకిది జ్ఞాపకమునకు వచ్చినది.

చిత్రాం— ఎవరా నవమన్మథుఁడు ?

అంటి— మఱియెవరు ? మీసవతిబిడ్డఁడు.

చిత్రాం— ఏదేదీ? ఇందాఁక నీచేతికొక యుత్తరమిచ్చి దాచుమన్నానుగదా ? ఏమిచేసితివి ?

అంటి— ఇదిగో ! నాచీరకొంగున ముడివైచితిని.

చిత్రాం— అంటింతా ! నీవు నాకుఁబ్రాణమువంటిదానవుసుమా. నామనసు నీతో చెప్పెదను. అందరానిపండ్లకాశ యెందుకు— పోనీ ! యెందుకు ?

అంటి— ఏలినవారిమాట నా ప్రాణములోఁ దాఁచుకొందును తమకీ సందియమేల? సెలవిండమ్మా?

చిత్రా— ఆఁడుపుట్టుకకన్నఁ బాపముకద్దా? అస్వతంత్రపు బ్రతుకు? మనసులోని మాట పైకనవాటము కాదుగదా? ఆతఁడు— పోనిమ్మెందుకీ యరణ్యరోదనము?

అంటి— మనలో మనము చెప్పుకొనుట కింతజంకా? పెద్ద ప్రభువుగారు వేఁటకు వెళ్లునప్పుడు మీతోఁ జెప్పలేదా? వారు మీమనసుం బట్టి సంచరించలేదా? తమకెందు కీవిచారము?

చిత్రా— వారు వేఁటకు వెడలినారా యేమి?

అంటి— చిత్తము.

చిత్రా— (స్వగతము) ఎంతమంచి సమయము. (ప్రకాశముగా) అంటింతా! నేనాడజన్మ మెందుకెత్తితిని? నాకన్న నొకకూలిదైన మేలు. నాబ్రతు కీపంజరములోని చిలుకవంటిదికదా?

అంటి— ఎందుకట్లు కుందెదరు? పెద్దప్రభువారేమైన నన్నారా యేమి?

చిత్రా— నీవింకను బెరటిదారి నేయున్నావు? పెద్దమాట కేమి? చిన్నమాట చెప్పవుకదా? అంటింతా! నీమగఁడు పడుచువాఁడా? నడికాలపువాఁడా?

అంటి— అమ్మా? నాసౌఖ్యమేమని మనవిచేయుదును? మొట్టమొదట నొకచక్కనిపడుచుమగనికి మావారలు మాటలాడి



తుదకు నలువదేండ్లవానికి డబ్బుకక్కుర్తిచే నన్ను మొక్కపిల్లవలెఁ గట్టఁబెట్టిరి.

చిత్రా— ఇద్దఱమొక్కనోమే నోఁచినాము. పావురముల నెవరెగిరించుచున్నారని చెప్పినావు?

అంటి— (తనలో) ఈమెమనసింతసేపటికి బయలుపడినది. నాచేతికీమె యిచ్చినయుత్తర మాతనిని రమ్మనుమని కాఁబోలు? ఈసంగతి నాతోఁ జెప్పుటకు జంకినది. నేనిందుకుఁ దగినట్లు నడిచినయెడల గొప్పలాభముండును. (ప్రకాశముగా) అమ్మా! మీసవతికొడుకు.

చిత్రా— (తనలో) పెండ్లికొడుకు (ప్రకాశము) ఏమన్నావు?

అంటి— మన సారంగధరప్రభువువారు.

చిత్రా— అంటింతా! నాయొడలు పరవశమగుచున్నది, ఇఁక దాఁచలేను. నీమనసులో నుంచవలెనుజుమా ఏకాంతము.

అంటి— (తనలో) పాపబుద్ధిగలవారు గోడనుజూచి సయితము బెదరెదరు? (ప్రకాశముగా) సెలవిండమ్మా, నాయొద్దమీకు దాఁపఱికమా? మనలో మన కేకాంతమెందుకు?

చిత్రా— ఆచిన్నవాని చిత్రముం జూచినపుడే నాయొడలు ఝుల్లుమనుచున్నది. ఆతనిని స్వయముగఁ జూచినయెడ నేమగునో? మొదట నేనతనికే మాట్లాడఁబడితిని జుమా? దేవుఁడాఁడదైనచో నిట్టివిరుద్ధ ఘటన చేయునా? మఱి యొకచోట మన్నన మఱొకచోటనఘ్య నాపని. ఎందుకీ వెఱ్ఱియాసలు?

నావంటిదానికి జక్కఁదన మెందుకు? జవ్వన మెందుకు? బూడిదలోఁబోసినపన్నీరు. మాటవాసి కంటెనిజమా? అంటెంతా మాటెందుకుఁగాదు.

దావారిక— (ప్రవేశించి) ఏలినవారి సందర్శనమునకు సారంగధరప్రభువారి యొద్దనుండి గిలిగింత వచ్చియున్నాఁడు.

చిత్రా— ఏమేమి? సారంగధరుఁడు-సారంగధరుఁడు-సారంగధరుఁడు.

అంటి— తమసముఖమునకు సారంగధరప్రభువారు గిలిగింతను బంపినారఁట?

చిత్రా— రమ్మను.

దావా— చిత్తము. (నిష్క్రమించును).

చిత్రా— (తనలో) ఈనేరాఁగూడదా? కన్నులారఁజూచుకొననా? (ప్రకాశము) అంటెంతా! సారంగధరుఁడే యిందువచ్చునట్లుపాయమాలోచించఁగలవా? ఆయనఁగూడ వేఁటకుఁజనిరి. ఎంతమంచిసమయము? నాకంతయదృష్టముపట్టునా? పోనీ, నీచేతికిచ్చిన యుత్తరముఁజూపించి వానినిందోడ్చుకొని రాఁగలవా?

అంటి— అమ్మా! యుత్తరమెందుకు? లిఖిత మెన్నటికిని గూడదఁట. మీరుతొందర పడవద్దు. నేనుముందుగా గిలిగింతతోమాట్లాడి చిన్నప్రభువారిందువచ్చునట్లుఁ జేసెదను. నానేర్పు తామెరుఁగరా? (నిష్క్రమించును.)



చిత్రా— (తనలో) అంటెంత నెరజాణయే. ఏదైన నొకవన్నెగడ పన్ని నాప్రాణధనము నిక్కడికిఁ దెచ్చును. ఎంతచక్కనివాఁడు! చందురునికైన మచ్చకలదు. దేవుఁడీలాగు వ్రాసెనుగాని నేఁగోరుకొన్న మగఁడు వాఁడేకదా? ఇంతకును దేవుఁడురక్షించి యాయనగూడ నూరలేకుంట గొప్పలాభమే? పిట్టకైనను దెలియనీఁ గూడదు. వాఁడు వచ్చిన తోడనే కొడుకు మిషపైఁ గౌగిలించుకొనెదను. నిప్పు దాపున వెన్నయెట్లు కరుగకుండును? వాఁడును గ్రొత్త జవ్వనము కలవాఁడు, నావంటిసొగసరి కౌఁగిటఁబడ్డప్పు డెట్లాఁగఁగలఁడు? వలపునకు వావియేమి? బలిమినైన మరులుకొల్ప లేకపోదునా? ఓర్చుకొనుము హృదయమా! నాజీవితకాలములో నేఁడేనీకుఁ బండుగ. పాపమో గీపమో కోర్కెదీర్చుకొననిబ్రతుకు మత్తేమిబ్రతుకు? మనసున్నవాఁడే మగఁడు. వాఁడు వచ్చునంతలో సొగసుగ నలంకరించుకొనెదను? వానితో నాకుఁ బెండ్లిమాటలు జరిగినపుడే వానికిఁగూడ నాపైని మనసున్నట్లు తెల్లమయ్యెను. హాసారంగధరా! అలమేలుమంగ దేవతా! నా కోర్కె దీర్చినయెడల నీగోపురమునకు బంగరురేకు తాపించెదను. (అనినిష్క్రమించును.)

స్థలము:— చిత్రాంగిమేడ గుమ్మము.

గిలిగింత ప్రవేశించును.

గిలి— (తనలో) దేవిచిత్రాంగికడు చెడ్డది. పెద్దప్రభువుచే

నేనిక్కడికిఁ బంపఁబడినపుడెల్ల గంపెడు హాస్యములు నన్నాడు చుందురు. చెలికత్తెల నాపైనుసికొల్పి నాతోడవు లూడ్పించి నవ్వుచుందురు. ఆమెకేమగవాఁడైనా జాలఁడు. మనసునకు రానిమనువైనట్టైనఁ జోక విధిలేదు. ఇంకనాబ్రతుకోమేఁకమెడ నున్న చన్నులవంటిది. అందఱును హాస్యపుకత్తులు నాపైనూ రుచుందురు. కాని నన్నెక్కసక్కెములాడుట, దూలగుండినం టులే, కందిరీఁగపుట్టరేఁచుటే, కత్తి నాకుటే, సరేగాని యెంత వానినైనకొలువులోంగఁదీయునుగదా? ఒరులచిత్తము కనిపెట్ట వలెఁ, బడరానిపాట్లుపడవలె, కానిగడ్డు కఱవవలె? ఈజానెడు పొట్టకై కదాయింతకక్కుర్తి. అదిగో!యంటింతవచ్చుచున్న ది. ఇదిరాలుగాయ, గయ్యాళిగంప,పగలనంకాయ. చిత్రాంగి దేవికిఁ దోఁకవంటిది.

అంటి— (ప్రవేశించి) ఓరీ ! ఓసీ ! గిలిగింతగారూ ! చాలాదినములకునీరాక. నీవునామగఁడవైనచోనిన్నునాపైఁటలో నిముడ్చుకొని దాఁచుకొనక పోదునా ? యీమామిడిపండ్లుకావలెనా ?

గిలి— కోఁతపండ్లుగావు, తట్టపండ్లునుంగావు, నీయీరాలు గాయలు నాకెందుకు ?

అంటి— నిజమైన మగవాఁడ వైనచో మఱెంతగోఁటుచేయుదువో ?

గిలి— చేయుదునో.మానుదునో రాలుగాయలం బండిం



చక పోవుదునా, రసము పిండించకపోవుదునా, నీబలు పెండించకపోవుదునా ?

అంటి— ఆపాటిముఖమునకే యద్దసేరుపసపు. గిలిగింతా! హాస్యమునకేమిగాని మఱేమివింతలు ?

గిలి— మఱేమివింతలు, తెల్లబియ్యము పాటిమానిక. ఏమిరా కాటా యన నెప్పటి యాట లనునట్లు ప్రభువు లేదో మిషపైని నన్నిక్కడికంపుట, మీరందఱును నాకుని వట్టించుచుంట మిగిలినవేమో గబ్బిలములవలె నంటింత చెట్టునకు వ్రేలాడుచున్నవి.

అంటి— గిలిగచ్చలాగు వాఁగక చెప్పు మెందుకు నిన్ను సారంగధరప్రభువువారు పంపించినారు ?

గిలి— నడుమ నీరాయబార మెందుకు ? పిలువని పేరంటకము, చెప్పనివిందు. చిత్రాంగిదేవిగారితో నే నే చెప్పుదును. నన్నురమ్మన్నారుకారా ?

అంటి— నేడష్టమఁట. దేవిగారికి జ్ఞాపకమునకువచ్చినది. ఈదినమున నాపెకుఁ బేడిముఖముచూడనని వ్రతమఁట. ఈవర్తమానము నన్నుఁదెలిసికొమ్మని పంపినది.

గిలి— పేడిముఖముచూడనని నామువ్రతమా ? అట్లైన నాఁడముఖముచూడనని నావ్రతము. పోసి ! ఆమెచేనల్లరయే తప్పెను. దేవిగారితో చిన్నప్రభువువారు మనవిచేయుమనిసెలవిచ్చినారు. వారిపావురము దేవిగారిమేడపైనివ్రాలినది. అది పట్టించి నాచేతికిప్పించ మన్నారు. కోటదాఁపున సారంగధర

ప్రభువారు నాకొఱ కెదురు చూచుచుందుమని వార్తఁబంపినా రు. అదిగో! నాకుక్కపిల్లగూడ నాకొఱకు వెదకుచున్నది కను క నేనం దేగవలెను? నీవుత్వరగా పావురమునుదీసికొని యంతలో రావలెనుసుమా? ఆలుమగల కంటెంతా!

అంటి— మంచిది, పైఁటలోఁ జక్కిలిగింతా!

(గిలిగింత నిష్క్రమించును.)

అంటి— (తనలో) సారంగధర ప్రభువుపై జిత్రాంగిదేవి కిమోహము ముమ్మరముగా నున్నది. ఎద్దియైన నొక యెత్తు పన్ని యాతని నాపె కన్నులయెదుట నీదినమునఁ బెట్టనియెడల నీటితో నాపెబ్రతుకును నాబ్రతుకును సరి. ఇప్పుడు నాబ్రతుకు మంత్రసాని గండముసామెతగా నున్నది. ఈపారువము గూడ నాపూన్కి నెరవేర్చుటకే తప్పకయిందు వచ్చినది. ఇది యునొకమేలే. కానిచూచెదను. (ప్రకాశము) ఓయీ! గిలిగింత ముంతా.

గిలి— (ప్రవేశించి) వచ్చితినంటెంత బొంతా.

అంటి—(ఉత్తరమీఁబోవుచు) ఇదిగో! పోనీయెందుకు? దేవిగారిదివఱకేయీపావురముంబట్టి తమయొద్దనుంచుకొన్నారుచిన్నప్రభువుగారితోఁదల్లియొద్దకుఁ గొడుకువచ్చుట కేమియభ్యంతరమనిదెలుప సెలవిచ్చినారు గనుక నీవేగి చిన్నప్రభువారిందోడ్చుకొనిరా.

గిలి— చిత్తము. నీనోటిమీఁద నే నడుచుకొందును.

(నిష్క్రమించును.)



అంటి— నేను మేడపైనుండి సారంగధరునిరాక చూచి దేవికి దెలిపిన మఱింత బాగుండును. (నిష్క్రమించును.)

చిత్రాంగి పడకగది.

(చిత్రాంగి పాన్పుపయిఁ గూర్చుండి యద్దముచూచుకొనుచుండును.)

దాసి— (ప్రవేశించి) యేలినవారి మేడపై నొకచక్కని పెంపుడుపారువము వ్రాలి నాకుదొరకినది. దీని బంగరుటందెలంబట్టిచూడ నిస్సంశయముగఁ జిన్నప్రభువారిదిది ఏమి సేయుమని సెలవు?

చిత్రాం— అద్దీ! యేదీ కోరనికోర్కె నాచేతికిమ్ము. నీవుపోయి అంటింత యెక్కడనున్నదో తోడ్చుకొనిరా.

దాసి— చిత్తము. (నిష్క్రమించును.)

చిత్రాం—

గీ. తెల్లమొగలిపువ్వ ♦ తెఱఁగున నావన్నె
కానిచేత ముద్దు ♦ గాంచు నిన్నుఁ
బోలఁ జాలునట్టి ♦ పున్నెంబు నాకెప్డు
పట్టు చెప్పుమమ్మ ♦ పావురమ్మ.

క. నన్నెన్నఁడైనఁ దలఁచునె
చిన్నితనము నాటి నాదు ♦ చిత్తరువు పయిన్
గన్నడునె వాఁడు చెప్పవె
నిన్నున్ బ్రతిమాలుకొనెద ♦ నే పావురమా.

ఇఁక సారంగధరుఁ డిందువచ్చుటకు సందియము లేదు. దీని

నీదన ప్రాణమువలెఁ జూచుచుఁ క్షణమయిన విడువఁడనివినుచుందును. అంటెంత యేమియుంకనురాలేదు. యుగములైనట్లెంత యాలస్య మైనది. అది సారంగధరునిఁ దోడ్కొనక రాదు. నిశ్చయమే. నా యెడమకన్ను బెదరుచున్నది. తప్పక వానిని నేఁజూడఁగలను. నాకోర్కె దీఱఁగలదా హా! ఇదియేమి నా కొకవింతయుల్లాసమిపుడు పొడముచున్నది. నాముద్దుల సారంగధరుఁడిందు వచ్చునంతలో వానిపటముచూచుకొని పాడుచుం బట్టఁజాలని యీ మోహమునకుఁ దెరువు చూపెదను.

కరహరప్రియ—త్రిశ్రగతి.

ప. నిన్నుఁ దలఁచుకొన్న కొలఁది - నిబ్బరంబు లయ్యె।
వన్నెకాఁడ నిన్ను గుత్త - గొన్న మోహమయ్యె।
నిన్నుఁ జూడకున్న కనుల - నిద్దుర కఱవయ్యె।
కన్నె తనమునుండి నీసొ - గసుపయి మనసయ్యె॥ నిన్ను॥
౧. తలఁచుకుందునన్న మదికిఁ - దగులు మంటలయ్యె।
చెలఁగి నీదు పేరువిన్న - చెవికి విందులయ్యె।
ఉ. చల్లనిగాలి నిండుగల ♦ జాబిలి యామని పండుతోఁటలో
నల్లిన మల్లిపువ్వుపొద ♦ యచ్చటఁ జిక్కులఁజిమ్ము జంత్రిమా
మొల్లపుచిల్క పాట యట ♦ మోహముదీఱుట వన్నెకానితో
మెల్లని సోయగంబునడ ♦ మీఱుటయబ్బునె యట్టిముచ్చటల్.

అయ్యయో! నేవెఱ్ఱిదానివలెఁబాడుచున్నాను. ఎవరయి నవిందురేమోయిఁకఁ జాలించి యాలక్కమేడలోఁ బొన్పునలంకరింపించుచుఁ గిటికీసందులనుండి సారంగధరుఁడు వచ్చుచున్నాఁడేమో కనిపెట్టెదను. (నిష్క్రమించును.)



శ్రీరస్తు.

# సారంగధరనాటకము

## తృతీయాంకము.

ప్రదేశము: కోటయొక్క ముందలిభాగము.

ప్రవేశము.— సారంగధర సుబుద్ధులు.

గిలి— (ప్రవేశించి, తనలో) నేడష్టమియఁట. అష్టమినాం ద్రిమ నైధనతారవలె చిన్నప్రభువువారు, పినతల్లిగారు సమావేశమఁట. నేను రాయబారపు గొట్టమునయితిని. నేఁడేదో యుప్పెనపుట్టును. నాచేతికిఁ బావురమెందుకీలేదు? పేడి ముఖముఁ జూడనని యిన్నాళ్ళనుండి లేనివ్రతమిప్పుడుమాత్ర మెందుకుచెప్పవా? ఏదోకిటుకున్నది. సంపన్నాంధులోరుల మనసు నొచ్చునేమోయని తలఁచరుగదా? ఆమెనాముఖమెందుకు చూడఁగూడదన్నది? ఉప్పుపులుసులు దిన్న దేహములకన్నిటికి నభిమాన మొక్కటియేకదా? ఇప్పుడీలాగున నన్నది కాని పేడిముఖము, కోడెముఖము, నాఁడుముఖముతుదకన్నిటికి నొక్కటియేగదా మర్యాద. ఉన్నమాటన్నది నాకెందుకీకడుపుమంట? కాని, నేఁడుప్రత్యేకముగఁ జిన్నప్రభువుగారి నా

మెరమ్మనుటచూడఁగా నేదోయొక విపరీతమున్నట్లుతోఁచుచున్నది. పాపము, పాపము, పుణ్యము, పుణ్యము నాకెందుకు? నాపనియేమో నేఁజేసెదను.

(సారంగధర, సుబుద్ధులును సమీపించును)

సారం— (ముందుచూచి) అడుగో! గిలిగింత——

సుబు— పరీక్ష నెఱవేఱనివానివలె ముఖముఁద్రేలవేసికొని వచ్చుచున్నావేమిరా?

సారం— యుగము లుండిపోతివి. పావురమేదిరా?

గిలి— నాకుక్కపిల్ల మధ్యదారిలో నన్నెంత యల్లరపెట్టినదో మీకెఱుకా?

సారం— ఓరీ! నేఁ బారువముమాట నడుగుచున్నాను. నాతల్లికదా? యీమొద్దు నంపినకన్న నేనేపోయి నాముద్దుల పారువముం దెచ్చుకొన్న బాగుండును.

గిలి— అయ్యో! పావురమా? మీపినతల్లిగారు తల్లియొద్దకుఁగొడుకువచ్చుట కేమియభ్యంతరము. వ్రతములోనున్న నాయొద్దకుఁ బేడినంపనేలా యని దెలుప సెలవిచ్చినారు. ఆపావువముంబట్టించి వారియొద్దనే యుంచుకొన్నారు.

సారం— మాపినతల్లిగారి దర్శనముఁజేసితివా?

గిలి— మొక్కుకొంటయే లేదన్న నొక్క బ్రాహ్మణునికైనఁబెట్టుమన్నట్లు బాగుగ సెలవిచ్చుచున్నారు? నన్నామొగుమ్మముదరికే చేరనీలేదు. ఇంత సేపును నిలువఁబడి నిలువఁబడి కాళ్ళుపీకె తుదకీవర్తమానముం దెచ్చితిని.



సారం— పోనీ నేనే తెచ్చుకొనెదను. నీవుఁగూడ నావెంటరా!

గిలి— ఇంకకంఠములో జీవముండఁగా నేనాగుమ్మముద్రొక్కుదునా? నన్నువారు చంపివైచిన నొప్పుకొనెదఁగాని.

సారం— నేస్తమా! ఇక్కడనే యీగారడివాండ్రవినోదములు నీవుచూచుచుండుము. నేనిప్పుడే పోయివచ్చెదను.

సుబు— నాదొక్కమనవి. మీసవతమ్మగారి యొద్దనేభద్రముగ నున్నదికదా పావురము రేపుపంపించెదరు. తమకెందుకిప్పుడీతొందర

సారం— తనకలిమి యింద్రభోగమన్నట్లు, నీపారువము నీయొద్దనున్నదిగనుక నీకీనింపాది. నాపారువముం దీసికొనిరాక మానను.

గీ. పురిటిదాటుకొంచు నాఁకలి ♦ మఱచియైన
నన్నుఁ గనినంత వింతగ ♦ నడచివచ్చు
మఱియు నాచేతి వెలిదమ్మి ♦ మాడ్కి నియుడు
పారువము నొక్కక్షణమైనఁ ♦ బాయఁగలనె?
కనికరమది యెంతయలసినదో?

సుబు— తాము చదువుకొన్నవారు, విజ్ఞానులు. తమకు నేను మనవిచేయుపాటివాఁడఁగానుగాని, యిప్పుడొంటిగా నంతఃపురమున కరుగుట నామతముకాదు. ఏలసన

గీ. స్త్రీమనను సహజముగఁ జుల్క ♦ నా మఱియది
రాణివాసంబునం ద్రొక్కఁ ♦ బూనినపుడు

నీటిలో ముంపఁబడుబెండు ♦ సాటియగుచుఁ
బయిటి కుబ్బఁగఁజూచును ♦ రయముతోడ.

సారం— ఓయీ వెఱ్ఱివాఁడా! పిచ్చియనుమానము లేల?

క. కలముం[illegible]గల
తలిదండ్రులు కోడలితగిన ♦ దాంపత్యమునన్
జెలఁగు జవరాంద్ర చిత్తం
బులు చెలియించునెడ లోక ♦ మునవాద్దున్నే.

మఱియు నీతల్లి చెంతకుఁ బోవుట కెన్నఁడైన ననుమానించితివే? ఇదియెక్కడనైన లోకమందుకద్దా?

సుబు— తనుచిత్తము గాని, యిదివఱ కెన్నఁడునుఁ దామచ్చటికి దయచేసియుండలేదు. మఱియు నయ్యగారూర లేరు.

గీ. ఒంటిపాటున సొగసరి ♦ కంటఁబడుట
పలుకరించుటకొక్కనె ♦ పము దొరకుట
కలుగునప్పుడు మోహంబు ♦ కనులఁగ్రమ్మి
జ్ఞానులైన వివేకంబు ♦ గానలేరు.

సారం— సుబుద్ధీ! నాతల్లి నన్నుఁజూడఁగోరి పంపించెను. నాతల్లి సెలవు నేనెట్లతిక్రమించెదను? మాది నిష్కల్మషమైన పాండవవంశము. నన్ను మొదటినుండియు నీవెఱుఁగుదువు నాకడ్డపడకు నేఁబోయెదను.

సుబు— (తనలో) ఏమీయన్యాయము! ఈతనికాలోచనశక్తిపోయి, యెద్దియో గ్రహావేశమెత్తినట్లు తోఁచుచున్నది. ఇట్టితొందరపాటీతనియం దెన్నఁడు నేగానను. (ప్రకాశము) తాము పురుషులకుఁగూడ మోహనాకారులుసుండీ.



సారం— ఓయీ! నీవు ప్రాణమిత్రుఁడవని సైరించుకొలఁది నన్ను వారించుచున్నావు, తగనియనుమానములఁ బెట్టుచున్నావు? బ్రహ్మాదులడ్డువడినను నాతల్లియొద్దకిపుడుపోయి పారుపమునుఁదీసికొనిరాకమానను.

సుబు— [illegible]ప్పుడుగడియ మెఱుఁగున్నది. ఎంతోప్రొద్దు లేదు. ఏలినవారిం జిన్నప్పటినుండి కనిపెట్టుకొని యున్నవాఁడనుగనుక చనువుకొలఁది మనవిచేయుచున్నాను. వెఱ్ఱివాఁడనో మంచివాఁడనో (చేతులుపట్టుకొని) నేఁడునాపైని దయకాగ్రహముగలుగుటచూడఁగా యేదోవిపరీతహేతుభూతమైయున్నది. మదకంఠీరవము నొకయుఁబోతు వారించలేనట్లు తమ్ము నేనడ్డఁజాలనుగాని, పారుపము నొద్దనుంచుకొనియయ్యగారూరలేనిసమయమునఁదమ్ముం జూడఁగోరిన మీతల్లిపిలుపు పెంప్లైపోఁతుటలు

సారం— అడ్డకు. తొలఁగుతొలఁగుము.

సుబు— చిత్రాంగి దేవి—

సారం— (సుబుద్ధిందొలఁగఁద్రోసి) నీలో నీవిక్కడ వెఱ్ఱి తర్కము వెలువుచుండు, నేనువినను.

సుబు— విడలించిపోవ న్యాయముకాదు. పూర్వము సారథియడ్డపడినపుడు మీముత్తాత యభిమన్యుఁడు సాహసించినట్లు మీరును?జనుచున్నారు.

(సారంగధరుఁడు వినిపించుకొనక నిష్క్రమించును.)

సుబు— (తనలో) అహా వరప్రసాది! యీతఁడు నాప్రాణమిత్రుఁడేమీ గ్రహచారము? పెద్దప్రభువువా రూరలేరు,

జగన్మోహనుండయిన యీతనింజూచి చిత్రాంగి కేమిదుర్బుద్ధి పుట్టునో? ఈతఁడు సత్యధురంధరుఁడు. చిత్రాంగికి లొంగని యెడల నామెయేమిపాపమాలోచించునో? యీశ్వరా! పాండవవంశమునకిది తుదకాఁబోలు నోరీ గిలిగింతా! నీవైనం బరుగెత్తి యాతని కాళ్ళపైఁబడరా?

గిలి— మదపుటేనుఁగు నాఁపుటకుఁ గుక్కపిల్ల పరుగిడునట్లే?

సుబు— పోనీ! నీవామేడ చెంతకుంబోయి జరుగునదికనిపెట్టుము. మాతండ్రిగారితో నేనీసమాచారముం దెలుపనేగెద.

(నిష్క్రమించును.)

ప్రదేశము;- చిత్రాంగి నగరు.

(చిత్రాంగి యంట్రింతలు, మేడకిటికీనుండి సారంగధరునిరాకకెదురు చూచుచు.)

అంటి— అమ్మా చూడుఁడు. కట్టుతెంచుకొన్న మదపుటేనుఁగువలె నదే చిన్నప్రభువువారు వచ్చుచున్నారు.

చిత్రా—

గీ. చిన్నతనమునుండి ♦ చిత్తంబులోనెడఁ
బాయకుండునట్టి ♦ హాయితలఁపు
కన్నులందు నెంచు ♦ కన్నభాగ్యము వాడు
ప్రాణపదమె యదిగో ♦ వచ్చుచుండె.

ఆహా! యేమిటీవి? యెంతసోగ! చూడ రెండుకనులుచాలునా? వీనితో నేలాగునఁ గలిపెదవొ సుమా? కోర్కెదీర్చుకొనక నిల్వలేను. పిమ్మట నేమైననుసరితో. ఏమిచక్కఁదనము? చేరువైనకొలఁది నీతనిచాయ పసిఁడినిగ్గులు వెలువుచుండె నెంతలేసి చూపులు! చూపులా నెమ్మికింబ్రాపులు నెలఁతలకుం దూపులు వక్షస్థలమెంత వెడల్పు? నేనెప్పుడందుసోలెదనో? యేనుఁగుతొండములుకాని చేతులుకావు. నాచేతులార గంధమెప్పుడు పూసెదనో? ఏమియద్భుతమోసెమ్మ! నాచూపువీనిరూపునందు చిక్కుకొని మఱలఁజాలకున్నది. వీనితో నేనెట్లు మాటగలిపెదనోగదా? నాకుఁబరవశమగుచున్నది. వానియొక కష్టమైనచో వీనిపై నామనసుదగులనేల? నామోహముతో నేమిపని? వీనికి నాపైమనసు కలుగవలెనుగదా? ఒడలొడలుదాఁకిననెంతటి ధైర్యశాలికైనఁదమిపుట్టకమానదు. ఏమటకానిమ్మఁక నిల్వలేను. నేనీసమయముఁ బోఁగొట్టుకొని క్షణమైనబ్రతుకఁగలనా? పాపముమాట తరువాతఁ జూడవచ్చునిటువంటి కోర్కెచెల్లకుంట యేపాపము. ఏమే నేపాన్పుపైని గూర్చుండెద నీవువానిందోడ్కొనిరా.



అంటి— ఈసంగతి పెద్దప్రభువువారికిఁ దెలిసిననేమగునోకదా

చిత్రా— తెలియుటెట్లు? ఏమైనఁగానిమ్ము నాకోర్కెదీరిన వెనుక నాకుఁజావైననుసంతోషమే. ఏలాగు తెలియును? చేసినవారము చెప్పముగదా? ఇక్కడ మఱెవరున్నారు. నేనునీవేకదా? వాఁడిష్టపడినచో మనకేయపాయముం గలుగనేరదు.

అంటి— కానిండు చూచుకొందము. నేనిదిగో తోడితెచ్చెదను. (ఇరువురు నిష్క్రమింతురు.)

సారం— (ప్రవేశించి, తనలో) నిష్కారణముగ స్నేహితు నిం దొలంగం ద్రోసినొప్పించితిని. నాకెందుకడ్డపడవలెను? లేనిపోని యనుమానములు పెట్టినాండు. నాకు తల్లివంటిది గదా? అంతటిపాపమెందైన కలదా? నాకెందుకీతలంపు. నా పావురమందుకొని త్వరగా నీతావునుండి వెడలెదను. ఈమేడయెంత రమణీయముగ నున్నది.

సీ. ఇరుదస్లకీల్బొమ్మ ◆ లింపుగంబాడంగ
స్వర్ణంబు నెక్కొంపం ◆ జాలు మెట్లు
అద్దంబువలె మేని ◆ నంతయుం గన్పర్చం
జాలిన నున్నని ◆ పాలగచ్చు
చివకశిలతోడం జెలంగి ◆ నవగసముల్
చెలువారం జూపెడు ◆ చిత్తరవులు
మాటిమాటికి వింత ◆ మాటలాడుచుం బంజ
రము లలరించు గో ◆ రలు చిలుకలు
కలుగు నీమేడపైనుండి ◆ కాంచునపుడు
క్రిందిజనములు చీమల ◆ చందముగను
తోంటలుం బూరిబయిళుల ◆ వాటముగను
గానంబడుచుండెం దిరిగెడి ◆ కన్నుంగవకు.

అదిగో! నెవతెయో పరిచారిక వచ్చుచున్నది. ఏమే? మా పినతల్లిగారెక్కడ నేంచేసియున్నారు?

అంటి— లక్కమేడలో తమకొఱకెదురుచూచుచుం బావురమునకు మేంతలిడుచున్నారు రీలాగున దయచేయుండు.

సారం— (నడుచుచు మేడనుజూచి)



గీ. అయ్యగారికి నాదు పి ◆ న్నమ్మపైనిం
గలుగు ప్రేమకు రిచటంద ◆ ర్కాణముగను
విలయు బంగారు బలుకంబ ◆ ములుగ దూల
ములు మహిలోననిట్టి యా ◆ ద్భుతముగలదె.

(ముందుచూచి) ఆకూర్చున్నవారె మాపినతల్లిగారు కాంబోలును? అమ్మగారికి నమస్కారము.

చిత్రాం— శోభనపు పెండ్లికొడుకవు కమ్మ. రా వోయి! అక్కడ కాదీ మంచము పయికి. నీకు నాయొద్ద నేమి యభ్యంతరము?

సారం— అమ్మగారూ! తమకొడుకున కింత మన్ననయేల? తమ సెల వతిక్రమింపక వచ్చితిని. నా పారువము దయచేయం గోరెదను.

చిత్రాం— అయ్యో! నీవు వచ్చిన దేది? కూర్చున్న దేది? పారువమున కేమిగాని చూడుమీపట మెవరిదో?

సారం— ఇది నాదే.

చిత్రాం—నన్ను మొదట నీకుం బెండ్లిమాటలు జరిగినపుడు మీ తండ్రిగారిది నాయొద్దకంపించినారు నేనుగూడ నీపటములో నీచెంతనున్నట్లు వ్రాసియున్న నెంతబాగుగనుండును? పోనీ, యిప్పుడు ప్రత్యక్షముగానే యావేడుక గలిగెను ఓయీ! నిన్నుం జూడవలెనని కన్నులు కాయలుకాచినవి. ఇపుడు కొడుకుననుచున్నావు? మొదట నా పెండ్లికొడుకవు నీవేగదా?

సారం— హర హరా! యీపెడధోరణి వింతగా నున్నది. హా ప్రాణమిత్రుండా సుబుద్ధీ! అమ్మా నాపారువమో?

చిత్రా — చేతులుజోడించ నేల? నీకన్నఁ జిన్నదానఁగదా? ఎంతచక్కనివాఁడవోయి సారంగధరుఁడా! వలపు వావినెఱుఁగదుకదా?

సారం — అమ్మా! మాతండ్రిగారు వేఁటకు వేంచేయునపుడు మంత్రితోఁగొన్ని రాచకార్యములనుఁగూర్చి నన్నుమాట్లాడుమని సెలవిచ్చినారు. ప్రొద్దుపోవుచున్నది గనుక నేఁబోవలెను. కటాక్షించి బిడ్డనికి సెలవిప్పించఁగోరెదను.

చిత్రా — నిన్నుఁగటాక్షించి యెవతె విడువఁగలదు. మంత్రితో నావల రాచకార్యముల కేమిగాని నాతో నీ వలరాచకార్యములఁ జూడుము. ఓయీ! నిన్ను జూచిన కన్నులే కన్నులు. ఇంకొక గడియ నాయందు నీ వేకటాక్షించి కూర్చుండరాదా? నేటిసమయము రేపువచ్చునా? నీకొఱకెన్నాళ్ళనుండి యెదురు చూచుచున్నాను. నేటికిఁగదా నాకోర్కె దీఱెను! (చేతులుపట్టుకొని) నామనసింకను దెలియలేదా? ఎక్కడితల్లి వావి వచ్చినదిరా? వలపునకు, వావికిఁ జాలాదూరము.

సీ. తనయంతఁ గోరిన ♦ తెనిమిటి యెదకొబ్బ
రవిక గుట్టులఁ జెలుల్ ♦ గయికొనంగ
ముందుకెల్లెడు గోర్కె ♦ చందము దఱచిన
యంత నిట్టూరుపు ♦ లల్లుకొనఁగ
నీఁడుజోడులనెంచి ♦ యెదుటి చిత్రిణిగాంచు
నప్పుడు కన్నీటుల ♦ లముకొనఁగ
తేపు మాటనుమాట ♦ కైపని కొత్రివ్వాఁడి
కోణ యుబ్బాళు ♦ లూరుకొనఁగ



ఈ యూబారంబు వచ్చిన ♦ రేయి గడిచె
నోయి నిద్దుర కన్గవ ♦ మూయలేక
తెక్కుపాటులు యుగములై ♦ కప్పురములు
వేఁడిములఁ జిందఁ గందిన ♦ విరులపాన్పు.

సారం — హరహరా! యీమెమీఱుచున్నది. మొదట స్త్రీలెయజ్ఞానినులాపై వారలకు స్వేచ్ఛదొరకుటవారియవివేకమునకు మఱింత బలకరము నేనింకఁదప్పించుకొనకున్నఁ గీడుమూఁడును. అమ్మా! మాతండ్రిగారు భూలోకదేవేంద్రుఁడు నేనునీకుబిడ్డఁడను. ఇదివఱకు మనవంశము మచ్చలేనిది.

గీ. నీతిదొఱఁగుట విశ్వాస ♦ ఘాతనేఁత
కామదుర్గంధ కూపంబు ♦ లోఁమునుఁగుట
తెలిసి తెలిసియు దుఃఖంబు ♦ దెచ్చుకొనుట
తల్లియపకీర్తి బ్రతుకులు ♦ తగునెమనకు.

మఱియుఁ దనువులుపోవునుగాని మాటశాశ్వతముగ నుండును.

చిత్రా — ఓయీ! నీవు తెలిసినవాఁడవు. నమువనేర్చెదఁ బ్రొఁకకు, నన్నల్లరచేయకు. కీర్తియపకీర్తియు నాకుందెలియును. వావికిఁజిన్నవుగాసి వయసునకుఁ బెద్దవుగావా?

గీ. విందపాల్చేసినన్నుఁజం ♦ పందలంచి
వలపు విఱుపఁగ విసమున ♦ వావితెలిచి
పోఁదలంచితె నెఱజాణ ♦ పూలబంతు
లానవాలంపునది మది ♦ యందులేదొ.

నీవెఱుఁగవా? నాకుఁబ్రపంచకముచీఁకటిగనున్నది. కన్నులల్లిదారివేఁటు, నాదారివేఱు.

గీ. వలపుకోనసాగఁజూచు జ ♦ వ్వనపుపెంపు
కన్నెప్రాయము మొదలు నిన్ ♦ గనుఁగొలంపు
పొందుపఱ్చని నీవాలి ♦ మండలింపు
లేకఁగుడువని విందల ♦ కేకతములు.

వావులకెక్కడికి? వేఁడినీళ్ళకింక్లు కాలునా?

సారం— అమ్మా! మాటవచ్చును. నామాటవిను. మోహపడుటకు నాది స్త్రీజన్మముకాదు. నేనిందువచ్చుట యెల్ల భంగులందగదు.

గీ. అగ్నిసాక్షిగఁ బరిణయ ♦ మాడుకొన్న
ధవుని యెదలోనఁ దలఁగని ♦ తంపివెట్టి
బంధువులకెల్లకిఁ దల ♦ వంపుచేసి
జారగాడుంటకన్నను ♦ జావుమేలు.

మఱియు లోకమన్నిటికన్న నాకుసత్యమే ప్రియమయ్యెనేని నన్నుఁగన్నతల్లియే సాధ్వియయ్యెనేని నేనిందువచ్చినమాత్రమున నాకపకీర్తి యెట్లంటును? ఆపిశాచము మావంశముదాఁక లేదు. మాతాతతండ్రులు పరకాంతా విముఖులు. నేఁడు నాతోఁగదా యావ్రతభంగము కావలయును. అమ్మా! బోధించినం దెలియదీ లోకమెంతయజ్ఞానమయము?

చిత్రా— నిన్నీలాగు వినుచు యుగమ్ములైన బాగుండును. మతులెన్ని చెప్పినను మామేయున్నట్లున్నదినాని. ధర్మశాస్త్రమునకు వలపునకు చాలాదూరము.

సీ. పక్కటి పచ్చిక ♦ ప్పురఁతమ్మునఁబువ్వ
పుంబంతియాటలఁ ♦ బొదలుచున్న



మంచిగంధపుతావి ♦ మించు నేమ్మనమూ
రొక్కనుమఁబల్లవి ముద్దు ♦ గొనకయున్న
మనసు దీఱనిపంత ♦ మునకు రెట్టింపుమఁ
జొక్క తీయనిమోవి ♦ నొక్కకున్న
మగని గద్దియఁబోలు ♦ నురముపై మెల్లన
వాలుగన్నులు దేల్చి ♦ సోలకున్న
వన్నెలాండ్రులు నీబోటి ♦ వన్నెకాని
డాఁపియాఁగుటలెట్లు? ని ♦ న్నాపితాళు
టెట్లు? చులకన చేయక ♦ యేలుకొమ్ము
వాఁడివయసున ముదుసలి ♦ పల్కులేల?

ఓయీ! నీవు పిచ్చిపట్టు పట్టకు, మనసు రాయిచేసికొనకు. నీకుఁదగినదానననియేకదా మొదట నన్నునీకు మాట్లాడినారు మాటలెప్పుడు జరిగినవో యప్పుడే నామగఁడవైతివి (కౌఁగిలించుకొనుచు) ఇప్పుడు కొడుకువెట్లగుదువు? సారంగధరుఁడా నాకుమాట తడఁబడుచున్నది.

గీ. మేనుల మదుల నొక్కటి ♦ గానొనర్చి
రక్తిలోనఁబ్రపంచవి ♦ భ్రమము దొలఁగి
వాసిమీఱఁగ నిప్పుడ ♦ ద్వైత సిద్ధి
పొందుదము రార యీతేఁ ♦ డుంచ నేర.

(ముద్దుఁబెట్టుకొనుచు) యింకనాఁగలేను, నాకోర్కె చెల్లించు-

సారం— (చెవులుమూసికొని, తనలో) హరహరా! మాతండ్రిగారెంతయో తపసుచేసి నన్నుఁగాంచిరి. ఈఘోరపాపమునకు నేసంగీకరింపకున్న నన్నీమె బ్రతుకనీదెట్లైనసరియే.

(ప్రకాశము) అమ్మా! నీకిట్టిపాపపుబుద్ధి తగదు. మనసుమ
ర్లించుకొనుము.

క. జగదేక వీరమూర్తిగ నె
నుఁగు రాజివి మేటివఁపవు ♦ నుంజదివిన
వనుచిత భాషణముల నీ
తనయునితో నిట్టులాడఁ ♦ దగునే తల్లీ.

ప్రాణముపోయిననసరియే కాని నేనిపాపమున కొడిగట్టఁజాల
నన్నింకను మీఁకమ్మృదువు తప్పునుసుమా?

చిత్రాం—

గీ. గుండె రాయిచేసి ♦ కొనికోరివచ్చిన
నన్నుఁ జాల్కువాడ ♦ న్యాయమఁటర
ఒక్కమాఱు మోవి ♦ నొక్కవేరా నీకుఁ
బున్నె మబ్బునోరి ♦ వన్నెకాఁడ.

నామనసుదీర్చరా, నీకాళ్ళపట్టుకొనెదరా, స్త్రీహత్యగట్టు
కొనకురా, బ్రహ్మానందమెఱయనీనురా, యింకనెన్నఁడు ని
న్నుఁగోరనురా, యిప్పటికిమాత్రము (కాళ్ళపైబడుచు) కరుణిం
చరా, బ్రతికించరా.

సారం— (విదలించుకొనిపోవుచు) స్త్రీవని యోర్చినాను.
మావంశమునకు నీవుకారుచిచ్చువైతివి.

చిత్రాం— కర్కోటకుఁడా! విదలించెదవా, నన్నుమఱుపె
ట్టుకు. నీకు జయము కాదు, పోకు పోకు (అడ్డుపడి) నామాట
వినవా?



గీ. రక్తకన్పర్చఁబిగిలిన ♦ గయికఁ జూడు
కోరి మొలవయి జాతిన ♦ కోఁకఁజూడు
గడగడవడంకు మైమూరు ♦ కాఁకఁజూడు
మాఱుపల్కక నన్నొక్క ♦ మాఱుకూడు.

సారం— అమ్మా! నేఁడింటిలో రేపుమంటిలోనవగడియ
తుచ్ఛసుఖము? ఘోరపాపము నేసహింపఁజాల నిఁక నాగ్ర
హమువచ్చుచున్నది.

గీ. నిను వనుంగూర్చి విభుని క ♦ న్నీరు మాడు
మీతి చాటెదు నపకీర్తి ♦ నోరు చూడు
పైపఁజాలని వాదు కై ♦ జాఱు చూడు
బుద్ధిగొని తుచ్ఛమా మోహ ♦ ముడివనాడు.

అడ్డకు తొలఁగు తొలఁగు.

చిత్రాం— వద్దుచుమీ, వినవుగదా పోవుచున్నావా? కా
నీచూడు. రేపునీరక్తము బొట్టుపెట్టుకొనక నాపగదీఱునా?

సారం— మాతండ్రిగారితో నెద్దియో ఘాపముకల్పించి చె
ప్పి చంపించెదవు? ఇంతియేకదా? సత్య హృదయముతో హా
యిగాఁజచ్చెదను. (ఇరువురు నిష్క్రమింతురు.)





శ్రీరస్తు.

# సారంగధర నాటకము.

## చతుర్థాంకము.

స్థలము:— రత్నాంగి దేవి యంతఃపురము.

ప్రవేశము:— రత్నాంగి, దాసి వలవంతతో.

రత్నా— వలవంతా! నీచేతిలోని పత్రమేమిటే? సమస్తపురాణములును జక్కఁగాఁ జదివిన పుణ్యరాశి మాయమ్మగారు నాతోఁగూడ నీకుఁ జదువుచెప్పించి పెంచినందుకుం దగినట్లే నీవుగూడ నెల్లపుడు నెద్దియో చదువుచు నానందించుచుందువు. ఇంతకు నీవంటి మంచినడత గలదానియందలి చదువు పరిశుద్ధపాత్రమందున్న భక్ష్యమువలె నింపగునుగదా?

వల— శారదావతారమగు నేలినవారివంటి పతివ్రతాశిరోమణి ముందు నాచదువును, నా యోగ్యతయును నేపాటివి? ఏలినవారికిఁ జిన్ననాటినుండియు సేవకురాలియందలి చెల్మి పెంపున నిట్లు సెలవిచ్చుచున్నారుగాని యీపత్రమిల్లాలితనమని యొక చిన్న ద్విపదపద్యము. తమతల్లిగారు తమ్మును సారెపంపుచునపుడిది తమకిమ్మని నాకాజ్ఞ చేసిరికాని నాపెట్టెలో నేదీ



నినిన్నాళ్ళవఱకును బరాకువలన యేలినవారికి సమర్పించనందుకీ సేవకురాలిని క్షమించ వేఁడెదను.

రత్నా— సంతోషము. ఏదీ— (చేతనందుకొని)

ద్విపద. అత్తవారింటికిఁ ♦ నడఁకువఁ జూపు
పొత్తున నీతోడి ♦ పొలఁతులకోపు।
మాటిమాటికి నవ్వ ♦ మాటలాడకుము।
నీటుతో దుతఁ బరు ♦ నిదెసఁ జూడకుము।
తుంటవలా చేడెల ♦ తో జట్టుగొనకు।
కులబంధువులఁ జూడఁ ♦ గోటుతోఁ జన[illegible]।
చిఱుతిండ్లకై నాసఁ ♦ జేయఁగ రాదు।
మఱి పైఁటజార్చుచుఁ ♦ ము[illegible]దగాదు।
చిల్లర పాటలఁ ♦ జెలఁగి పాడకుము।
అల్లరమూఁకతో ♦ హాస్యమాడకుము।
తలవాకిలిం జేఱఁ ♦ దగదని యెఱుఁగు।
కలిమిలేముల నొక్క ♦ కైవడి జరుగు।
పగటియందును నిద్ర ♦ పట్టింపఁ బో[illegible]।
నగడి పైవారికోం ♦ డేము వినకు।
ప్రాణితుల్ పెనిమిటి ♦ యందుంచుకొమ్మ
దాని నెల్లపుడు నైద ♦ వమ్మని నమ్మ।
మగనికంటెను వేల్పు ♦ మఱియుండు లేదు।
మగనివలె నోరుడు ♦ మన్నించఁబోఁడు।
హాయిగ నీ వెప్పు ♦ డభివృద్ధి గాంచు।
మాయమ్మ యీమాట ♦ మదిలోన నుంచు॥

కంటివా చెలీ! కిల్లలు సత్కీర్తితో నభివృద్ధినొందవలెనని తల్లులెట్లుకోరుచుందురో? మఱియు నాకున్న నగలన్నియును మాయమ్మ యిచ్చిన యీపత్రమునకు సరిరావుకదా?

వల— సూర్యునకు వెలుఁగుఁ జూపించునట్లు సహజసద్గుణాలంకృతలగు నేలినవారికిట్టి నీతిపద్యంబులఁగ జెప్పుట యనవసరము.

(గిలిగింత పాడుచు ప్రవేశించును.)

కాఫిరాగము—చతురశ్రగతి.

ప॥ అన్నన్న నేఁడొక్క - యాశ్చర్యమాయె
మాయాఁబోతుకట్టు తెంచి - హద్దుమీఱిపోయె।
కొన్నవాఁడూరకే - కున్న సందాయె।
వెన్నవంటిమనసు - వేఁడిదాఁకులాయె।
యేదెట్టులౌనో నాకేల మా - లాల మాలాల మాలాల॥ అ॥

చ. చేతనున్న పిట్ట - చెలరేఁగి పోయె।
మా- చిన్నన్న చీకఁటిలోఁ - జిక్కువడుటాయె।
నీతిచెప్పినట్టె - నేస్తము వెటాయె।
లోఁ తెలియంగని నీటి - లో గంతులాయె।
కూతుకూతు కుక్కపిల్ల కేఁ - గొట్టుదునా
నీకిప్పుడొక మంచి జెల్ల॥ అన్న॥

చ. చప్పనాఁతివంటి వాని - చొప్పుగవఁడాయె।
మాయప్పవేల్పువంటివాఁడు - తప్పుదారిపోయె।
ఒప్పుకున్న చిన్నవాని - కొద్దఁబెండ్లాయె।
చప్పుడరాఁడేమి యింక - జాము రాత్రిరాయె।
కడుపులోనున్న కామాయా నీవు - గంతకయ్యానిన్నుఁదగలేయ॥



రత్నా— ఓయీ గిలిగింతా! పనివిరాఁడవచ్చినట్లున్నావేమి? యీవింతపాట భావమేమో తెలుపవా?

గిలి— అల్లబ్బె ననన్నన్నన్నన్నన్న మఱికం టెనున్నున్నున్నన్నన్నన్నిఁకనేమైనఁ గానిన్ని నిన్ని నిన్ని మఱి వచ్చిన్నిన్నిన్నిన్ని దేవుఁడుమీకు మేలుచేయఁగా నట్టుపై నాకురాదుగా, దీనికేమిగాని, యెక్కినది తాడి, మెక్కినది కల్లు, కుట్టినది తేలు, పట్టినది దయ్యము, వెంటబడ్డవాం డ్రుగుంటలు, తాఁగోఁతి యన్నట్లున్నది. నాకడుపు మండుచున్నది, నాకన్నము పెట్టిన రా లేదా?

రత్నా— నీచిన్నప్రభువుతో నివుభోజనము చేయలేదా యేమి?

గిలి— కడుపేలేదనఁ గొండుకుపేరు సోమలింగమన్నట్లున్న దిదివఱకతఁడిల్లే పట్టలేదు.

రత్నా— కట్టా! నాపట్టిం దేగినాఁడో యిదివఱకును రాకుంటకుఁ గారణ మేమి చెలీ? నాయన్న నేఁడు పుట్టినదినము, నేటితో వానికిఁబదునెనిమిదేఁడ్లు వచ్చినవి. పెద్దప్రభువారు వలచి కట్టుకొన్న నాసవతి మొదట నాబిడ్డనికే మాట్లాడఁబడుటనీవెఱుఁగవా? నాయన్న యిదివఱకును పెండ్లిసేయఁబడకుంటకుఁ జింతించెదను. కొడుకునుఁ గోడలును ముచ్చటదీఱ నిల్లలంకరించుచుంటచూచుటకన్నఁగన్నవారికన్నుల కింకేమి పండువు కద్దు.

గిలి— నాచిన్నప్రభువు నాచిన్నమ్మయు ముచ్చటలాడుచుండఁగా, నాకడుపు నిండఁగా. నా కుక్కపిల్లతోఁ కి నాడించు

చునాయొడిలోఁ గూర్చుండఁగా నాకన్నుపండుగ.

వల — పూర్ణయౌవనముతోఁ బున్నమచందురునవలెఁ జిన్నప్రభువువారు ప్రమదల కగపడుట కనరావుగదా?

రత్నా — పోనీ, నాయన్న వెయ్యేండ్లుబ్రతుకనీ? వాఁడివయసునఁ బరిణయముకాకుంటతగ దెందున్నాఁడు చెప్పుమానాయన్న!

వల — అదిగో! చిన్నప్రభువువారు వచ్చుచున్నారు?

సారం — (ప్రవేశించి) ఆహా! సుబుద్ధింగాదని యేగినందుకు ఫలమనుభవించితిఁగదా?

గీ. తెల్విదివ్వెచూపి ♦ తెలిపినఁ గానరు
మోహ తిమిరమందు ♦ మునుఁగువారు
అకట చెడుగువావి ♦ నరయక చిత్రాంగి
యెంతపనికి సాహ ♦ సించె నిపుడు.

పాపాత్మురా లెంతతలంచినది? తాను మాయయ్యకుఁ బ్రాణమువంటిదికదా? విశ్వాస మొకింతయుం జూడదు కదా? నేఁడేమికాఁదలిచియున్నదో?

వల — అమ్మా! అదిగో! చిన్నప్రభువువారు వచ్చుచున్నారు.

రత్నా — వెయ్యేండ్లుబ్రతుకు నాయనా! మాటలో నేవచ్చితివి భోజనము చేసితివా?

సారం — (కన్నీరులతోఁ గనులొత్తుకొనుచు) అమ్మా! నేటి ఘోరము నేనెట్లుచెప్పఁగలను?



రత్నా — అయ్యో! నన్నుఁ గన్నతండ్రీ నాచంటికూనా! (కౌఁగిలించుకొనుచు) నీకంటనీరెన్నఁడట్లు చూడలే దేమిఁ జరిగెనురా కొడుకా!

సారం — అమ్మా! మధ్యాహ్నము మేము పావురముల నెగిరించఁగా నాపావురము సవతితల్లి చిత్రాంగిమేడపైవ్రాలెను. దానిందీసికొనిరమ్మని యీగిలిగింతను బంపితిఁగాని పినతల్లిగారు నన్నేరమ్మని సెలవిచ్చినారు. నాహితుఁడు సుబుద్ధి నన్నువలదని మళ్ళించుచుండ వినక పావురముపైనాసతో నేనామెయొద్దకేగితిని. పిమ్మట నేనేమి దెల్పఁగలను నానోరాడకున్నది. మాయయ్యగారితో నేమిచెప్పునో? యెంతపాప మాలోచించినది?

రత్నా — అయ్యో తండ్రీ, నాసవతికొంపదీసి నిన్నేరమ్మని బలిమిపెట్టినదా యేమి?

సారం — నేనాపాపమున కొప్పక విదల్చుకొని తప్పించుకొనుట దుస్తరమైనది. రేపామె నారక్తము బొట్టుపెట్టుకొందునని యొట్టుపెట్టుకొన్నది.

రత్నా — ఆహా నాతండ్రీ నాకడుపుచల్లగా నీవుసత్యమునుగాపాడినావు. సత్యమునిన్నుఁ గాపాడదా? నీయయ్యగారితో నాసవతి యేమిపన్ని చెప్పునో? కట్టా యెంతవచ్చెను? మొదటనదినీరుమాట్లాడఁబడుటవలన నింతయయ్యెను. ఛీ ఛీ కులకాంత గదా నాసవతి యెంతపాపమొడిగట్టుకొన్నది. (కనులొత్తుకొనుచు) యింకనాకేమిదారి?

సారం — అమ్మా! వ్యసనపడకు. రేపటిసంగతికిప్పుడెందుకే.

విచారము? నేనింకను సంధ్యావందనమాచరించుకొనలేదు. నాకు సెలవిమ్ము. తిరిగి తమపాదసందర్శనముచేసెదను.

రత్నా—తండ్రీ! వరప్రసాదివినీకేయపాయమును రానేరదు కాని యెప్పటి వర్తమానమప్పుడు నాకుఁ దెలియనిమ్మా. త్రిలోకజననీ పార్వతీ! నీవే నాబిడ్డనికి రక్ష. (నిష్క్రమింతురు.)

ప్రదేశము:—చాకలవానియిల్లు.

ప్రవేశము:—చాకల గిజిగన్న, భార్యయంటితో.

గిజి—(తనలో) ఏమిచెప్పుదుమా తెల్లవచ్చినది. ఇప్పుడే కదా మలికోడికూసెను. ముందు పని పెట్టుకొనఁగనిద్ర యెట్లుపట్టును? మఱియు నది సామాన్యమా రాజుగారిపనిగాని నేను కానా నీరాజు దెమ్మన్నప్పుడెల్ల బట్టలు సిద్ధపఱచుచున్నాను గాని యింకొకనికి శక్యమా? యీజామారు చాఁపునకుఁ జిఱువేళ్ళరంగు, నీరొంటిపువ్వు బోడసరంచు చాఁపునకు గులాబీపూతీగ చేసిబాగుచేసినానుగాని, వారుముఖ్యముగా రేపటికే తెమ్మన్న మాఘిడంచు చుట్టుదల్తురుచాఁపింకను దెమలకుండెను. మఱియు నీచాఁపు మిగులఁదళసైనది. రంగుపట్టించుట కష్టము. రంగునట్టముకాఁగూడదఁట? పల్చన కాఁగూడదఁట? అందులోనుఁ జెక్కుజాభరా? నవ్వులా! పిలుకసాగఁదీయును. దీసినిఁగూడలేపెదను నాకుసహాయపడునేమో? కదలదుమెదలదు మొద్దుదొంగనిద్దుర? దీనికిఁ గావలసినంతసేపును దయ్యమునలెఁబిల్చుకొని తినుచు నన్నుతెప్పవేయనీదు. (కాలితో తన్నుచు) లేవే? పని చేయవలెను?



అంటి— అబ్బా! యెన్ని జన్మములకైన నిద్రిమగఁటు వద్దు దేవుఁడా? కాన్పుతక్కువ గడబడ హెచ్చు, పట్టి గొడ్డునకుఁ దాఁపులు మెండు. సరే యెందుకులేపెదవు?

గిజి— ఎంత పోతరించినావు? చిత్రాంగిదేవి తుంగిళ్లు మెక్కియెంతకొవ్వినావు? నేఁబిలిచిన నీకుచిరాకా? రాజుగారి చాఁపులు కేపీకపోయిన మనపనియేమగునో నీకెఱుకా? లెమ్ము త్వరగా రంగులు కావలెను.

అంటి— ఇంటిలోను, గోటలోను మత్తేమిపని? యెంతసేపును రంగులపనే? (కన్నులునులుపుకొని లేచును.)

గిజి— ఇదిగో రాత్రి పైటకుఁబోయివచ్చెదనని యెప్పటికి వచ్చినావో నాకెఱుకేలేదు. నిద్రపట్టిపోయినది. నీగుణమెన్నశక్యమయిన నొక్కలాగే యున్నది. ఈతట్టమోయక విధిలేదు. దిక్కుమాలిన లోకముగాని. మింగవాటముకాను, కక్కవాటముకాదు, దొంగగొడ్డువు నీకెన్నితన్నినను సిగ్గులేదు. కోటలోఁగూడ నీకేమిరంగు?

అంటి— నాకుఁగాను మా చిత్రాంగిరాణీగారికి—

గిజి— మెల్లఁ మెల్లగాఁజెప్పు. నానేస్తుఁడు మహాంతకనాయకుఁడూరుకాచి యీపాటికి మునుపటివలె మనవీథియరుగుమీఁదఁ బడుకొన్నాఁడేమో? ఏమేమి? చిత్రాంగి రాణిగారికెవరిపై రంగు?

అంటి— అటువంటి దొరసానులకే పట్టింపులేనప్పుడు నన్నే మాదినసేనమూరకేచంపెదవు? నిన్నరాత్రి యెంతముచ్చటజరిగి

నదోసికెఱుకా ? తెల్లవారనీ, పట్టణమంతయు గగ్గోలుపుట్టును అయ్యో నానోటనూఁగింజ నానదేమి సేయుదును.

గిజి— ఏమిటా ముచ్చట ? చిత్రాంగియెవనినిలాఁగినది ? ఆహా దైవమా! ఆఁడదెంతయుఁదనంతఁదాలొంగియుండవలెను గాకున్న దానిని లొంగఁదీయుట యెంతటి మగవానికైనశక్యమా ? సుగుణములు నైజముగఁబుట్టవలెనుగాని యితరులు నీతులుచెప్పిన నేపాటికుదురును. నీతులు పోఁతపాలవంటివి. చెప్పుమేమి జరిగెను ?

అంటి— చిత్రాంగిరాణి నిన్నసందెజామునఁ జిన్నప్రభువుగారిని దనమేడకు రప్పించి తనతోఁగమ్మని బలిమిపెట్టెను.

గిజి— అయ్యోయేమి ఘోరము పాపమనియామెకుఁదోఁచలేదా ?

అంటి— చేతకాని మగవాండ్రు, పాపమని, పుణ్యమని యోర్వలేక పడుచువారిని బెదిరించెదరు. పాపపుణ్యముల కేమిగాని పిమ్మట నేమిజరిగెనో వినుము. చిన్నప్రభువువారందుకొప్పక విదలించుకొనిపోయిరి. అందుపైఁ జిత్రాంగియలిగి చీఁకటింటిలోఁ దలకట్టుకొని పండుకొనియున్నది. తెల్లవాఱఁగానె పెద్దప్రభువుగారితోఁ జిన్నప్రభువును జంపించుట కెద్దియోపాపము కల్పించిచెప్పును. ఈముచ్చటయంతయునాకనులముందేజరిగెను గాన నాకీకెఱుకవచ్చెను. రేపుచిత్రాంగిచెప్పినకల్లదబ్బరసాక్ష్యము పెద్దప్రభువువారితోఁ జెప్పవలసివచ్చునేమో ?

(వీధి యరుగుపైనుండి యంతయు వినుచున్న వంతెకనాయకుఁడు జబ్బన్న లోనికిఁబ్రవేశించి.)



జబ్బ— గిజిగన్నా! నాకంతయు వినఁబడుచున్నదిలే ?

గిజి— జబ్బన్నా ! పాపము పాపము ! పుణ్యము పుణ్యము ! మనకేమిపని ? మనమేదియు నెఱుఁగనట్లె యుండవలెను గాకున్న మనప్రాణములమీఁదికి వచ్చునుజుమా ?

జబ్బ— ఎంత ఘోరముజరిగెను ? చిత్రాంగిరాణికెంత దుర్బుద్ధిపుట్టెను ? తలుపు మూసికొనుఁడు నేఁబండుకొనెదను.

(గిజిగన్న, భార్యతో నిష్క్రమించును.)

జబ్బ—(పోవుచుఁదనలో) చిన్నప్రభువువారిపై నేరమువోపఁబడినయెడల వారునాచేతికేఁగదాయొప్పగించఁబడుదురు. దేవుఁడునాకీనిజమును ముందుగాఁదెలియనిచ్చుటమేలే ? ఓహో! చిన్నప్రభువువారెంతమంచివారు ? (నిష్క్రమించును.)

(రాజు వేఁటనుండి వచ్చుచుఁగోటనుసమీపించి, అందలమునుండిలేచి.)

రాజు—(తనలో) రాత్రివేఁటాడి యడవినుండివచ్చుచుండఁగా దుస్స్వప్నహేతువై వెడవెడనిద్ర పట్టినదిగాని సుంతయుం బడలికతీఱలేదు. హరహరా! స్వప్నమెంతనిజముగఁదోఁచును మఱియు నిప్పటితెల్వి యప్పుడెక్కడికిఁబోవునో? మానవుఁడనెంత ? మాయనెవ్వరెఱుంగరాదుకదా ? నన్నుఁదెల్పుటకుజంకి కాఁబోలు నందలము మోయువాండ్రందఱిట నలసటతోఁబడి గుఱ్ఱుపెట్టుచున్నారు. మఱిరెండుగడియలకుఁబ్రొద్దుదూఱవచ్చును. కోటయంతయు నిదివఱకు మాటుమణిఁగియున్నది. కాని యెక్కడనో కొల్వుచావడిచెంతఁ గానవచ్చును. గిలిగింతగాని

గొంతువలె వినఁబడుచున్న దెంత బాగుగఁ బాడుచున్నాఁడు. పిలిచినం బాటమానివేయునేమో? ఇక్కడనుండియే వినియెదను.

(గిలిగింత పాడుచు ప్రవేశించును.)

మేలుకొలుపు, భూపాళరాగము — అటతాళము.

ప॥ మేలుకో యినుఁడ - మేలుకో ఘనుఁడ।

అ॥ మేలుకో యినుఁడ - మేలుకో ఘనుఁడ।
మేలుకో చీకటి - జాలు ముసుఁగుదీసి॥ మేలు॥

౧. జారులు చోరులు - జల్పవఘోరము।
జనుల కెఱుకపర్చ మేలుకో॥

౨. సాఁగి దయ్యము వాఱ - చల్లగాలి మీఱ।
వేగుచుక్క జాఱ మేలుకో॥

౩. వెలిదమ్మి పీడఁగఁ - గలువపూ వాఁడఁగ।
తెలినుతా బావలెా - దెఱబయలు దేఱఁగ॥ మేలు॥

౪. కాకికావరికూయ - ఘూకము కనుమూయఁ।
గోక విరహము వాయ॥ మేలు॥

రాజు— ఓహో! మొగలి మొదలగువింత పూఁబొదలఁ బూయించుచుఁ బలురకంబుల మధురవృక్షంబులు గాయించుచు, సహజంబులగు నడకలందు ప్రేళ్ళిపాఱు కొండ సెలయేటిం బోలి వీనిధోగణిగూడ నెంతరమణీయముగ నున్నది. అయ్యో! యూరకున్నాఁడే మవ్యవస్థిత చిత్తుఁడు. పోని, యింకఁ బిలిచెద నోరి గిలిగింతా!

గిలి— గిలిగింతా, వలవంతా, అంటొంతా, ఎంట్రింతా



ఎకిరింత, చికిలింత, బాలెంత, చూలింత, కుట్టిణీబొంత, అంతింత, చింత, మంచి పేళ్లే. ఓహో! ఏలినవారు కనులపండువుగా విచ్చేసిరి. ఎన్నిసొట్టనక్కలవేఁటాడినారు, మఱెన్ని గుడ్డికొంగలకువల వైచినా రింకెన్ని చచ్చుతొండల గురిబన్నినారు. మఱియు నెన్నియడవి దోమలం జంపి తెచ్చినారు. తమ వేఁట వైభవ మొకసారి సెలవిండు. వివేకసింహముంబట్టిరా లేదా.

రాజు— మేడమెట్లపైఁబడి దొర్లెడు దంతపు[illegible]యవలె నీ నోరాఁగదేమిరా? నీవన్నట్లు వేఁటయందెద్దియుం జిక్కలేదోరి బెబ్బులిమాత్రము వేటువడి పాఱిపోయెను. మఱొకయాఁడులేడి సమీపించెనుగాని దానికన్నులఁజూడఁ జిత్రాంగిదేవి జ్ఞాపకము వచ్చినదిరా? కనుక యాలేడిం జంపుటకు చేతులాడలేదు. కొన్నిపందులను, గణుజులను మాత్రము కొట్టితెచ్చితినోరి! మిక్కిలియలసియుంటిని. దేవి చిత్రాంగియొద్ద విశ్రమించవలెను. సన్నజాజులవలువము సుంగిడి పంపుకొన్నప్పుడా మెముఖమిట్లుండును జుమా? ఇప్పుడీచంద్రునిఁ జూడఁగా మహాకవి గాయకశిరోమణి చెప్పినపద్యము స్ఫురించినది.

గీ. పొద్దుజాడలఁగనిగంది ♦ హద్దుమించి
జాణిఁగిపోయిద్దివాదగు ♦ చుక్కబంట్లు
ఇఱుమపాటున బలగము ♦ లెడసియుంట
తెల్లమని రిక్కరాయఁడు ♦ వెల్లఁబాఱె.

ఆహా! మహాకవిగాయకశిరోమణి చెప్పినదెంతయునిజము. వినుమోరీ, నిన్న నాచే బెబ్బులి వేటఁ దప్పినపుడు బంట్లొకఁడైన వన్నంటి యొవని సుట్టుకువాఁడు జడిసి నలుదట్లు పరుగిడిరి.

గిలి— అంతకన్న జరిగినది జరిగినట్లేచెప్పుదును. నేనొక పద్యమునుజేసితిని. తమశిష్యుఁడనుగానా-

రాజు— ఏదీచదువు, నపుంసకకవీశ్వరుఁడా ?

గిలి— ఉన్నమాటన్న నెవఁడునుకాఁడు ? చిత్తగించుఁడు.

గీ. తానొనర్చిన చీఁకటి ♦ తప్పితీఁగియు
మగని విధిలేక కనిపెట్టు ♦ మగువఁబోలె
వెలి[illegible]డి పొద్దుముంగల ♦ నిలిచెఁజందురుఁ
డాకసపు పెనమునందు మా ♦ డట్టువలెను

రాజు— చీఁకటితప్పన్న నేమిరా? క్రిందుమీఁదులుచూచుకొనిపలుకుచున్నావా. నీకేమియాశ్చర్యము కలిగెను.

గిలి— చిత్రాంగిదేవిగారి మేడకువిచ్చేయుదురుకాఁబోలు? దయవేయుఁచు మనవిచేసెదను. నిన్నటియుదయమున కీయుదయమునకుపదినాలుగుగడియలు. క్షణముమనదికాదు ఎప్పటికేదిజరుగునోకదా ?

రాజు— ఏమైన వింతలుకలిగినవాయేమి ? రాత్రిమాకొకదుస్స్వప్నముకలిగెను. చిరంజీవి సారంగధరుఁడుసుముఖుఁడా ?

గిలి— ఏలనట్లడుగుచున్నారు ? రాత్రినాకుఁగూడ నొకకల వచ్చెను. నాకఁట, వేగురుకారు, నాలుగురుకారు, మూగురుకారిద్దఱాఁడాండ్రఁట. అందుపెద్దదియిల్లాలఁట. చిన్నదిగయ్యాళియఁట. చెప్పుమన్నారా? అబ్బా! భయమగుచున్నది. పోనీ చెప్పెదను. ఆచిన్నదఁట- కాదుమఱచినాను. పెద్దయామెకొక చక్కనిమంచికొడుకఁట. నాచిన్నయాలువానిని రమ్మనిబలిమి



పెట్టినదఁట. వాఁడువిదలించుకొని పాఱిపోయినాఁడఁట. పిమ్మటనాచిన్నయాలుకోఁతిమైనదఁట. గంతులువైచినదఁట, కఱ్ఱ బుఱ్ఱనున్నదఁట. నిక్కినదఁట నీల్గినదఁట. అటుపైనాకు జ్ఞాపకములేదఁట. దీనికేమిగాని, తమకేమికలవచ్చెను ?

రాజు— నీకలవంటిదే యించుమించు నాకలయును. అదియొకపాడుకల దానినిస్మరించఁగూడదు. వింతలులేవుగద ?

గిలి— మఱేమివింతలు ? పాపముపాపమే, పుణ్యముపుణ్యమే, నిజమునిజమే, అబద్ధమబద్ధమే ? తల్లితల్లియే, కొడుకుకొడుకే, మీరుమీరే, నేనునేనే ? సరిగాని, నిన్న నొక వింతజరిగెను. చూడలేదు గానివిన్నానేమో ? పోనీ మనవిచేసికొనెదను. మనపట్టణపు మదపుటేనుఁగు కట్టుదెంచుకొని పూఁదోఁట కొలనులోఁబడినదఁట. మొసలి యొకటి దానింబట్టుకొనెనఁట. అప్పుడాయేనుఁగు మొసలిం దప్పించుకొనిపోవుట యెంతోకష్టమయ్యెనఁట. ఇదినిజమే. నిజముకా దబద్ధమే. అబద్ధము కాదిహిహిహీ. ఇదిగో చిత్రాంగి యమ్మవారిగుడి. కాదుమేడ గుమ్మము. అదిగోయంటెంత యేలినవారిందోడుకొనిపోవ నచ్చినది. నాకు సెలవిండు నేఁబోయెదను.

రాజు— రా రా వాఁగు వాఁగు.

గిలి— వావివాఁగు వరుసమంచిచెడ్డ. ఓదేవుఁడా! ఏజన్మమునకైన నేమగవాఁడుకావద్దు, ఆఁడదికావద్దు, రాజుకావద్దు, రాణికావద్దు.

రాజు— వింత పిలుపు కట్టువురా జంకెదవేల ?

గిలి— ఒకటి రెండు మూఁడంటుంతతో నలుగురు, గిలి గింతతో మేడకునొప్పి యేమోయిఁక మనస్సుదప్పి, విధినాకొప్పి జంకాకా దేలినవారికేఁగనికర మంటింతకుమచ్చరము, నాకునిబ్బరము.

అంటి— అమ్మగారు రేకాంతంబున—

గిలి— గోడలు చెవిటివనుకొన్నావా? అంటింతగుల్లా యేలినవారికట[illegible]ము. నేఁబొమెదనా ఉనూత్తైనఁగానివ్రతముచే ఉచుకొందునా?

రాజు— ఏమిరానీవ్రతము?

గిలి— నేను చూడనన, నాకుబందియేమి? నేనాఁడు దాని వంటనేయుంటను.

రాజు—నపుంసకలింగమా! నీకిదిసహజమే. (అంటింతతో) ఏమే నావ్రాణధనమెందున్నది?

అంటి— అమ్మగారు చీఁకటిగదిలో నేదోయలుకతో నన్నట్లున్నారు.

గిలి— (తనలో) ఆహా, మీసము లేదయ్యోరా యలుకన్న మూడఁగొట్టెదను. ధూర్తాగ్రగురా లేమిపన్నునో? అయ్యో నా చిన్నప్రభువో యయ్యో నేనో! నీవువేల్పువంటివాఁడవుతండ్రి

రాజు— ఏమీవింత పొలయలుక? కానీ యిదేమంచిసమయము.

ఉ. లాలితఁ గొండలోరి కను ♦ లంబడుదబ్బ అనంతము తెప్పం
బా తెగఁ జిమ్ముచున్ చెదవి ♦ చాటొనరించుచుఁగో ఱిచ్చుకులనే



గేలుల నొద్దుకొందు గిలి ♦ గింత కొకంతట నవ్వి పన్నుచన్
దాలిమిదూలనోలు నెల ♦ తందమిదీటఁగ ముద్దులాడెదన్.

అంటి— ఇదిగోదీపము వెలిగించినా నరుగోయమ్మగారు.

రాజు—

గీ. సన్నమబ్బునఁ దోఁచెడు ♦ చందురువలె
ఆకుచాటుఁడిన గులాబి ♦ యలరుమాడ్కి
నీటఁబ్రతిఫలియించు మా ♦ నికమువోలి
చీరముసుఁగునఁజిత్రాంగి ♦ చెల్వుమీరె.

ఈగదిలో నేల పండుకొన్నావు? నీవున్నయెడఁ జీకటివెల్లడి గదా, మసిగాజులోని దీపమువలె మాసినచీర నేల నీయొడలు వెలిగించుచున్నది. (ముసుఁగుదీసి ముద్దుపెట్టుకొనుచు)

గీ. నేఁటబడలిక వాపె బ ♦ ల్వేఁడిచెందు
మేనఁబుల్కలు రేఁపె బి ♦ త్తానఁగన్న
గవకు మూఁతలుదాపె స్వ ♦ ర్గమునుఖమ్ము
చూపె నీతనుసంస్పర్శ ♦ సుందరాంగి.

ఉ. చూడవిదేమి యొక్కమొగిఁ ♦ జూపులఁజీఁకటివెల్గులీన మా
టాడవిదేమి పల్పెదవు ♦ లందునముత్యముకెంపులొల్కఁగాఁ
బాడవిదేమి కన్గవల ♦ వాలిచి చిల్కలునాలకింపఁ గే
ల్మోడుచు బంటుపై నలుక ♦ బొందుటలేలనె ప్రాణనాయకా.

(ఒడలుతడుముచు)

గీ. బేడిస కనుంగొనలకు నీ ♦ రోడనేల?
వీడి కొప్పిటు క్రిందకీ ♦ రాడనేల?
ఒప్పు చన్గవపై రయి ♦ కూడనేల?
సనతెలుఁగున నీరుమే ♦ న్వాఁడనేల?

ఆహా! నెత్తురుచుక్కలు నీకెట్లువచ్చె. నాస్వప్నము నిజమే. ఏదుర్మార్గునివల్లనీకీకీడుకలిగెను. వాఁడెవ్వఁడైనం జెప్పు తక్షణ మేచంపించెదను.

చిత్రాం—(ఏడ్చుచు) ప్రాణనాథా! యీఘోరమువిూతో నేనేమనిచెప్పెదను.

గిలి— అమ్మ దీనిజిహ్వపడిపోను, ప్రారంభించెను.

చిత్రాం—(లేవఁబోయిపడిపోవుచు)నాయొడలుపచ్చిపుండు కీళ్లూడకున్నవి. ఏనుఁగుకలఁచిన కొలనువలెనయ్యెనాపని. చావునకు సిద్ధముగనుండి నాపుణ్యమున మిమ్ముఁజూడఁగలిగితిని.

రాజు— (చిత్రాంగితలతనతొడపైనిడుకొని) దేవీచిత్రాంగీ! ప్రాణేశ్వరీ! నీకుభయములేదయ్యో పలుకవేమి? అయ్యయ్యో మూర్ఛిల్లినది. ఏదేయింతా మంచినీరు?

గిలి— మహాప్రభూ! అమ్మగారికి పిశాచగుణమనుకొనెద నిన్ననీలాగేయొకవెలయాలు భూతముపట్టి విఱుచుకొనిపడియొడలెల్లఱక్కుకొన్నది. సెలవయినయెడల వదలఁగొట్టెదను.

రాజు— ఔను నిజమైయుండవచ్చును. లేకున్న పులిమీసములఁబెఱుకనెవఁడుసాహసించును? నేననుకొన్నదితప్పే. కట్టా! యీదయ్యమెట్లువదలును.

గిలి— ఏలినవారు కొంచెము సహించెదరేని నిముసములో దానియబ్బతోఁజెప్పుకొనునట్లుచేసెద నేమున్నది, దుప్పటిముసుఁగుపెట్టి కారుమిఱపకాయ ముక్కులోఁబొగవేయుచుఁజింతరువ్వలతో నాలుగంటించినచో దయ్యము, దయ్యమున కూఁత



నూఁకిపోవును

చిత్రాం—ఓరీ కాఱులుపేలకునిన్నుఁజంపించెదను. దయ్యములేదు గియ్యములేదు. వీరు నాప్రాణేశ్వరులుకారా? నేను వారిపాదములను విడువని యిల్లాలనుగానా? ప్రాణేశ్వరా! సేద తేఱితిని.

అంటి— మహాప్రభూ! మంచినీళ్ళు మిక్కిలిగఁ బట్టినచో వాతముచేయునేమో?

గిలి— అంతపైత్యపుశరీరమునకు వాతమెట్లుచేయును.

చిత్రాం— ప్రాణేశ్వరా! యీదుర్మార్గుని నాయెదుటనుండి తొలఁగించుఁడు. జరిగినసంగతిమనవిచేసెదను.

రాజు— ఓరీ పేలకు మిక్కడనుండిపో.

గిలి— (వెడలిపోవుచుఁదనలో) నామీఁదికిఁగూడఁజెచ్చునేమో దీనియొద్దూరగ. రాయాపదా! నిన్నుమేమడ్డఁగలమా?

చిత్రాం— ప్రాణేశ్వరా! యేమిచెప్పుదును? నేనెందుకుబ్రతికియుంటిని. నేనాఁడదైపుట్టనేల? ఓదైవమా! గంపంతకన్ను పెట్టుకొని నీవేచూచుచున్నావుగదా. ఎంత ఘోరమెంతయపకీర్తి. నాకుమాట తడఁబడుచున్నది కొంచెమాఁగెదను.

రాజు— ప్రాణేశ్వరీ! తొందరలేదు. నింపాదిగాఁజెప్పు. హా యేపాపాత్ముఁడునీకిట్టియపకృతిచేసినాఁడో యొక్కమాటలోఁ దెలియనిమ్ము.

చిత్రాం—(కోపముతో) ఓరీదుర్మార్గుఁడా! కొడుకువనుకొన్నానురా! నాప్రాణేశ్వరుఁడూర లేనిసమయమునవచ్చితివిరా!

తల్లికను పుత్రుఁడై ఖుఱ్ఱిటివిరా! యెంతపాప మొడిగట్టుకొన్నావురా నానాథుఁడు భూలోకదేవేంద్రుఁడు, నేఁజెప్పినఁ జిన్నఁబోవునేమో నేనెందుకు బ్రతికితిని.

రాజు— (తనలో) ఎవఁడిక్కడకు వచ్చియుండ వచ్చును? మంత్రియా, సుబుద్ధియా! కానీ తెలియును. ప్రాణేశ్వరీ! అనుమానించవద్దిందెవ్వఁడైనఁ జెప్పకతీఱదు. తాఁచును ముద్దిడ నెవఁడు తెగించి నోర్చుకొనును. ఖడ్గమా! నీకిన్నాళ్ళకుఁదగిన విందుదొరకెను.

చిత్రా— ఇఁకేమి న్యాయమిఁకేమి లోకమిఁకెక్కడి సత్యము. (ఒకచేత నోరుమూసికొని) అయ్యో! నా పాతివ్రత్యమో నా తివ్రత్యమో యిఁకేమియున్నది. కొడుకావాఁడు, మనపాలిటి యాదవముసలము

రాజు— ఏమేమి? సారంగధరుఁడే! నాస్వప్నమే నాకుఁజెప్పె నేమిజరిగెను.

చిత్రా— అంటింతా! నాకునోరాడదు నీవ్రదెలుపుము— పోనీ నేనే చెప్పెదను. ఆపాపాత్ముఁడు పౌరుషముమిషతో నిక్కడకువచ్చి నన్ను బలిమిచెఱపట్టినాఁడు. నేనెంత ఘోషించినను నిన్నాఁడు కాఁడాఁడుదానిని నేనేమి చేయఁగలను. తనుతోఁ జెప్పుటకు బ్రతికియున్నా నిఁక యేదో తెలివుచూచుకొని యీప్రాణముం బోఁగొట్టుకొనెద నపకీర్తి బ్రతుకునా కెందుకు ?

రాజు— సరేయాదుర్మార్గునిసనిపట్టించి యిప్పుడేవచ్చెదను. నీవుచనిపోనేల. ఎంత ఘోరమెంత యపకీర్తి. అంటింతా!



ఈ మెనుగొంపోయి గాయములకు మందు వేసి బాగుచేయుము.

(అంటింత చిత్రాంగితో నిష్క్రమించును.)

ఆహా సర్వేశ్వరా! యిదియెంతతలవంపు. నాహృదయసౌఖ్యము నేటితోసరి. మఱేమున్నది. నేనెంత పరాక్రమశాలినైనను, మఱెంతటి చక్రవర్తినైనను లోకములోఁ దక్కినఖ్యాతుల నేనెన్ని వహించినను నాకీమచ్చ పోదుగదా. జారత్వదోషమెఱుఁగని మృగాదు లెంతధన్యములు. ఒకవైపున గ్రోధమింకొకవైపున సిగ్గునునొక్క పెట్టునను బ్బి నాహృదయమునఁ బట్టఁజాలకున్నవి. ఆపితృద్రోహిని ఖండించినంత నీక్రోధముశాంతింప వచ్చునుగాని లోకములో నాకీనగుబాటు నాతోఁగానిపోదుగదా? ఇఁకెక్కడిపౌరుషము? భార్యాదుఃఖము లేనిన పుంసకుఁడెంతటియదృష్టవంతుఁడో? ఉచ్ఛిష్టమైన చిత్రాంగిని నేనిఁకముట్టనంటయుము, నాదుర్మార్గుని బ్రతుకనీకుంటయు నిదియే నానిశ్చయము.

తే. గీ. తనదునీడ తనకు ♦ దయ్యమౌనట్టుల
నాకుఁదోఁచినాఁడు ♦ నానుతుండు
తానొకటితలంప ♦ దైవమొక్కటిసేఁత
యకట యెంతస్పష్ట ♦ మయ్యెనిపుడు.

(నిష్క్రమించును.)

సారం— (ప్రవేశించి తనలో)

ఉ. అంతటనిండు నాకసమ ♦ యున్నియుమోసెడుభూమిసత్యముక
నుంతయుఁ దప్పిపోకచను ♦ సూర్యుఁడ లోకముకన్నమీరశే
యెంతయుఁజూచినారుకద ♦ సాక్షులు మీరలె నాసుఁజాంతియా
హాంశకురాలి బోధనకు ♦ లయ్యకు నాటనియట్లుచేయుఁడీ

ఏమీవిధి! ఆపాపాత్మురాలు నన్నుఁజంపించుట కూర్చె. ఆ య్యో యీదుఃఖమంతయునాతల్లిది. ఇంకనన్నుఁగూర్చి శో కించువారు నాప్రియమిత్త్రుఁడు సుబుద్ధితప్ప మఱెవరున్నారు? చావన నిద్రపోవుటవంటిదికాఁబోలు? నిండుజీవుఁడీబొందినెట్లు విడుచునో? ఎంతవచ్చెను? నాకింతవేగము మృతియని తెలియ దుగదా? జీవనములు జలబుద్బుదములు. సంపదలు క్షణభం గురములు. నిన్ననేగదా మాతండ్రిగారు నన్నుఁజూచి యెంత యో సంతసించిరి నేఁడువారిమోమెట్లు చూడఁగలను. పాప మెద్దియు నెఱుంగకుండుటచే నేనుజూడఁగలను. అంతటి శాం తులైనమాతండ్రిగా రెంతటి యాగ్రహముఁ జెందెదరో? సిద్ధాం తులేల నాజాతకములోఁ జిరాయువు నగుదునని వ్రాసిరి? కల్ల సిద్ధాంతములు, కల్లబ్రతుకులు. నేఁడునాకుమరణమా? యది ప్పటికైనందప్పదుకదా? చావునకు విచారించనుగాని, యపవా దమునకుఁజింతించెదను. పోనీ యీశ్వరుఁడు కరుణించి నేటితో నాకన్నిబాధలునుదొలఁగఁజేయును. అదిగో నాప్రియమిత్త్రుఁ డుసుబుద్ధి. దేవునివలె వచ్చుచున్నాఁడు.

సుబు— (ప్రవేశించి, తనలో)

సీ. కెందమ్మిరేకుల ♦ యందమౌ నీతని
కందోయి నిద్దురఁ ♦ జెందకునికి
దీర్ఘవిచారంబు ♦ దెల్పును నీతని
హస్తము ఫాలమం ♦ దమరియుండె
అవశమై వచ్చెడు ♦ నశ్రుపూరమ్ము ని
ట్టూరుపు వేఁడిమి ♦ చాటుచుండె



అపకీర్తి వెన్నంటి ♦ నట్టులు పేక్షింపఁ
బడి యీతనికిఁ గొప్ప ♦ విడిచె దరేసు
అకట నేనను కొన్నట్టు ♦ లయ్యెనేమొ
కానిచో నన్నుఁజూచిన ♦ తోన కొండ
పగిదిఁబొంగుచు నవ్వుముఁ ♦ బల్కరించు
చిన్నప్రభుఁడిప్పు డెందుకు ♦ మిన్నకుండె.

(ప్రకాశముగ) ఏలినవారికి సేవకునియందు నిన్నటినుండిక లిగినయలుక యిప్పటివఱకు—

సారం— ప్రాణమిత్త్రుఁడా! (రుమాలుతోఁ గన్నులొత్తు కొనుచు.)

సుబు— ఏలినవారిని నేనడ్డినానుగానా? హరహరా! ఈ శ్వరాజ్ఞ యిట్లున్నది.

సారం— నేనెందుకు పావురము నెగరవైచితి నదియామేడ మీఁదనెందుకు వ్రాలెను? నాకెందుకాబుద్ధిపుట్టెను?

గీ. ఆపదకు హేతువులుదోఁచి ♦ యైనఁదన్ను
ప్రాణమిత్త్రులు వారించి ♦ రైన నన్నుఁ
బోలి తప్పుత్రోవంబడి ♦ పోవుఁగాని
యకట దైవోపహతుఁడెట్టు ♦ లాఁగఁగలఁడు.

నాతండ్రిగారితో నాపాపాత్మురాలేమి చెప్పునో? చావునకు విచారించనుగాని నన్నుఁగన్నతండ్రి యెంతనొచ్చుకొనునో కదా

సుబు— ఆపాపాత్మురాలు మఱేమి చెప్పును. మీరుతన్ను బలిమి చెఱపట్టినారని కుట్రపన్ని చెప్పును.

సారం— సర్వసాక్షియగు దేవుఁడులేఁడా? సత్యము కావ

దా? విజ్ఞానులగుమాతండ్రిగారికి సత్యముఁబాడకట్టఁగూడదా?

సుబు— అయ్యా! లోకమేయజ్ఞానహతము. అందులో నాఁడుది పాపపునిగ్గు. దానినంటిన నెంతవిజ్ఞానికిని వివేకముం డఁబోదు.

గీ. నెఱులు నల్లమెయిలువలె ♦ విరియఁబోసి
నాసికాపుటము లెగర ♦ నత్తుమెఱయ
చన్నుఁగొండల సెలయేళ్ళ ♦ సరణివాలుఁ
గన్నుగవ నీరుగురియుచు ♦ నున్నయాలి
మాటలన్నమ్మఁబోవని ♦ మగఁడు కలఁడె.

సారం— ఆహా దుర్మార్గురాలా! నాపాలికాలసర్పమైతివి. తల్లినసుకొన్నా నెంత ఘోరముతలంచితివి. నాతండ్రికెంతవ్యాధి పెట్టితివి ఆయనసత్యహరిశ్చంద్రుఁడాతఁడెంత చిన్నఁబోవునో! సుబుద్ధీ! నేటితో మనఋణముసరి.

సుబు— అయ్యో! ప్రభువా, ప్రాణమిత్రుఁడా, వరప్రసాదీ, సుగుణపుంజమా తమకంటఁదడిపెట్టవలసివచ్చెనా నేనెంతపాపముచేసికొన్నాను. ధైర్యమువహించుఁడయ్యా. ఈశరీరములు క్షణభంగురములు. సత్యవ్రతులుగాఁ దాముదివ్యశరీరముతో నాచంద్రతారకముగ నుండెదరు. తమ్ముస్మరించినవారికిఁ బాపములంట నేరవు. చుక్కలలోఁ జంద్రునిమాడ్కి భూమీశులలోఁ బెంపుచెందిన తమతాత పరీక్షిన్మహారాజుగా రకాలమృత్యువునకు జంకక సకలమోహములఁ ద్రుంచి సర్వేశ్వరు నారాధించి శాశ్వతపదవి న్గాంచి రదితమ దివ్యచిత్తమునకుఁ దేవలయును.



మ. కలయందుత్తెడు మేనుదోఁచెను జగ ♦ త్కార్యంబులంజిత్తసం
చలతన్వాస్తవ మందుపోల్కిఁగనుఁడీ ♦ సర్వప్రపంచంబు వ
జ్ఞులకు న్నిక్కముగాఁ గనంబడదుఁ బ్రా ♦ జ్ఞుల్స్వప్నభావంబు ని
శ్చలమౌటందమకన్న వేఱుగ నరీ ♦ శత్వంబుఁ బ్రాపించుచున్.

సారం— ఓహో సుబుద్ధీ! నీపల్కులుకర్ణామృతంబులు. కనుకనింకనివ్వఁగోరెద. నాచిత్తశాంతికీరాజ్యసంపదలు కొరగావుకదా? ఏనిశ్చయముతో నేనీదేహమువిడువవలసియుందునో తెలియఁబర్చుము. నేఁడునాకు మరణముగూఢికదా. ఆహా విజ్ఞానిస్నేహితుఁడుగా దొరుకుటకన్న భాగ్యముకద్దా.

సుబు— అయ్యా! మనముపుట్టి యిన్నాళ్ళు పెరిగినాము. మనయనుభవమేమో చూచుకొందము. మొదట పురిటిబిడ్డం గూర్చియాలోచింతము. అదినిదురతో వెసలుననఁగా నుచ్ఛ్వాసనిశ్వాసములు తప్ప దానికి మఱియేయింద్రియవ్యాప్తియుఁ గలుగనేరదు. పిమ్మటఁగ్రమముగా శబ్దముతో దాని శ్రోత్రేంద్రియముస్పర్శముతో దానిత్వగింద్రియ మిట్టులన్నియు స్వసమాన సంపర్కములం దెలుపఁబడును. స్వసమాన సంపర్కము లేక స్వబోధనాభావమగు నదెట్టులనినఁబుట్టినతోనే మృగములవలెఁ బారుగు మనుజుల నెఱుఁగని మానవుఁడు తా మనుష్యుఁడనని తెలిసికొనలేఁడుగదా? ఇట్టులనేపురిటికందు ధ్వనివినఁబడక ధ్వనిచేయలేదు. స్పర్శముదగులక కదలలేదు. ఆబిడ్డకు జ్ఞానేంద్రియము లిట్టు దెలుపఁబడి క్రియలకుఁ జొచ్చుచుండ మనస్సు మొదలగు నంతరింద్రియములు మేల్కొన్నకొలంది నీసచరాచరప్రపంచమంతయుఁదోఁచుచుండును. మొదటనవ్యక్తముగ

బిడ్డయందున్న తెలివిబీజములో నివ్వృక్షమునలెఁ గ్రమముగ వ్యక్తపఱుచును. నిదురయొక్క ప్రారంభమునందు మనమనస్సు వ్యాపకములుడిఁగినట్లు తోఁచి నిదురమించినకొలఁదిఁ బలువిధముల వ్యాపకములకుఁ జొచ్చుచు మనకవశమ్మై కల్లపనులు సేయుచుఁ గల్ల సుఖదుఃఖంబులు పొందుఁగదా. ప్రస్తుతమనుసరింతము. మన పుట్టుక నిద్దురతో ప్రారంభించెనని ముందు మనవిచేసి యుంటి నన్నఁగా నవశములగు నింద్రియములతో మనమీ నిద్రాజన్మములెత్తి యీ జాగ్రత్స్వప్నములం గాంచుచుంటిమి. సుషుప్తియందెద్దియుందోఁచనట్లు నిశ్చలభావముగల ప్రాజ్ఞులకీ జననమరణ కార్యావృతమగు ప్రపంచము దోఁచనేరదు.

సారం— ఓహో ప్రాణమిత్రుఁడా! కలఁతనిద్దురఁ జెందువానిచెవికింబలె దుఃఖాక్రాంతుఁడనగు నాకు నీతత్వవాక్యములు దెలిసియుం దెలియకుండె. దేహమువిడిచిన పిదప నీ తెల్వియేమగును?

సుబు— దేహము పాంచభౌతికము. స్థూలోపాధి యిది. సూక్ష్మోపాధి యణురూపముగా నిల్చును గాని నశించనేరదు. దేహము స్థూలమైనపుడు తద్గుణమగు తెలివి వ్యక్తముగాను, సూక్ష్మమైనపు డవ్యక్తముగాను దోఁచును గావున మరణచింత ప్రాజ్ఞులకు లేదు.

సారం— కనఁదగిన శాస్త్రము తత్వజ్ఞునకు వలెఁ బుణ్యవశమున నాకు నీవంటిమిత్రుఁడు కలిగె. సుబుద్ధీ! యిఁక నాకు మరణచింత లేదు.



సుబు— ఇంకొకటి మనవి చేసెదను. ముందుబీజరూపముగా లేని దేహము లిపుడు గలుగుటెట్లు? కలిగినవి రూపభేదమందినట్లు తోఁచబడియు నశించుటెట్లు? సుఖదుఃఖములు రాతివంటి దేహముం జెందలేవు, గాలివంటిజీవునిం జెందలేవు. మఱియునెల్లతత్వశాస్త్రజ్ఞతకన్న నెక్కుడుసంతుష్టి సర్వజ్ఞుఁడు సకలశక్తియునగు పరమేశ్వరునియందు భక్తియే కలుగఁజేయును.

సారం— ఆపరమేశ్వరుఁడే నాకు శాశ్వతజ్ఞానము దయచేయుఁగాక. నాకిదియే తుదితలంపు.

సుబు— ఎవరావచ్చునది? (పరికించిచూచి) గిలిగింతవలెనున్నాఁడోరీ! తత్తరగాఁ బరుగిడి వచ్చుచున్నావేమిరా?

గిలి— అయ్యో యయ్యో మొట్టో కయ్యో పోయినది పోయినది. మఱేమున్నది భూమియున్నయిపోయినది. సముద్రమునీరైపోయినది. మఱేమిబ్రతుకు, మఱేమిలోకము. మఱేమి న్యాయము. పాడుమనుష్యులకన్నఁ బశువులు నయము, రాలు నయము, చెట్లునయము. ఎంతచేసితివ్రోనోరా, పాపపునోరా?

సారం— ఏమిరా సమాచారము?

గిలి— సమాచారమా, దురాచారమా, వ్యభిచారమా? దేవికాదు. మనపాలిటి మరిడీ. అయ్యో! నాచిన్నప్రభువా యయ్యో నేనో? దుర్మార్గురాలు, హంతకురాలు. గొడ్డునయము, కటికనయము. ఎంతదుఃఖ మెంతఘోర మెంతపాపము. నల్లత్రాఁచు, తిరుగనివిషము చిత్రాంగి. ఛీ ఛీ ఛీ యా పేరనఁగూడదు స్మరించఁగూడదు. ఎంతకుట్ర పన్ని చెప్పెను?

బల్మి చేయుటయ ? ఓపాపాత్మురాలా! ఓయంటింతగుల్లా! తప్పు సాక్ష్యమునకు నీనోరెట్లాడెనే? మీరిద్దఱును మాయిద్దఱికొంపతీసినారే? చిత్రాంగి, చిత్రాంగితోఁకా యంటింతా! గోట్టాలమ్మ మిమ్ములఁజూడదా ?

సుబు—— అయ్యో! చిత్తగించితిరా? మన మనుకొన్న క్లే యాదో హములాలు పాపముకల్పించిచెప్పెను. మీతండ్రిగారిందు న్యాయమడయుట దుస్తరమేలనన?

గీ వెఱ్ఱికుక్క వలెను ♦ మొఱ్ఱఁబెట్టు నరుండు
వెఱ్ఱికుక్క వలన ♦ విషముఁబొంది
అట్లు మంచివార ♦ లయ్యు దుర్బోధన
మందుటన్ వివేక ♦ మరయలేరు.

సారం—— మాతండ్రిగారేమి సేయుచున్నారురా?

గిలి—— ఇకమనపైఁ గత్తులు నూఱుటకుఁ గొల్లుచావడికి వచ్చెదరఁట? మీసవతితల్లి. యాయసిరితల్లి యామృత్యుదేవత యాదిబ్బపురోహితుని చెవికొఱికి తనవైపువాదించుమని పంపించెను. వానిపిలకజుట్టూడిపోను, వాని విభూతి బుగ్గిగాను, వానిజందెము పెరిగిపోను, వానియిల్లు దిబ్బఁజేర నాపాడు బాపఁడు ధర్మసభలో మనపై నేరము స్థాపించునఁట.

సుబు—— ధర్మసభకింకెవరు వచ్చెదరు ?

గిలి—— చిన్నప్రభువుగారి వైపునవాదించుటను మహాకవిగాయకశిరోమణి వేంచేయుదురఁట. మీతండ్రిగా రుభయపక్షములువిని నిజేచ్ఛానుసారముగఁదీర్మానించెదరఁట. మీరును నేనునుఁ జిన్నప్రభువుగారి వైపునను, నంటింతగుల్ల చిత్రాంగి



వైపునను సాక్షులఁట. ఇఁకొక్క క్షణమునకు మనకువర్తమానమువచ్చును.

సారం—— దీనికేమి ? చావునకిన్ని చావులు లేవుగదా ? ఈపాపిష్ఠలోకము విడచుటయేమేలు. సుబుద్ధీ! లెమ్ము. సర్వేశ్వరుం బాడి చిత్తశాంతిఁజేసికొందము

(అనియిద్దరును బాడుదురు.)

యదుకుల కాంభోజి—మిశ్రగతి.

ప. ఓపరమేశ్వరా – యోదీనమందారా।
యోదేవదేవ నీ – వెందుంటివో॥ ఓ॥
అ. ఈపాపజన్మము – లింకయెత్త నీక మ।
మ్మెట్లుకాపాడెదవో – రక్షక॥ ఓ॥
౧. సత్యంబుతెలియఁగ – జాలనియొరునకు।
సర్వేశ నీకుదక్క – । సత్యస్వరూప ని–
న్నరణము వేఁడినాము – సంసారభ్రమమాన్పర॥ ఓ॥
౨. దిక్కులన్నింటికి – దిక్కైన తండ్రీ మా–
దిక్కుచూచి కావరా – నిక్కముగా మేము–
నిన్నే కొలిచినాము । నీలోనమముఁజేర్చర॥ ఓ॥

గిలి—— అయ్యో! మనలను బిలుచుటకదిగో యమదూతలవలె భటులు వచ్చుచున్నారు.

సారం——

౩. గడియోక్షణమోయుఁక – గలదు మాబ్రతుకు సజ్–
జ్ఞానమిచ్చి కావరా । పడిపడిమోహము– బాపి
మాపనిను – భక్తి రూఢిసేయరా॥ ఓప॥

భటులు— (ప్రవేశించి) మహాప్రభూ! పెద్దప్రభువువారు మీమువ్వురను ధర్మస్థానమునకు రమ్మని సెలవిచ్చినారు. వార లిప్పటికి వేంచేయుచున్నారు.

సారం— సరియే మీరుపొండు మేమునువచ్చెదము.

(భటులు నిష్క్రమింతురు.)

మిత్రుఁడా సుబుద్ధీ! యిదిజన్మమునకుఁ గడపలగనుక స్నానసంధ్యావందనములాచరించుకొని పవిత్రవస్త్రములతో మఱియు ధర్మస్థానమునకుఁ జేరెదను.

సుబు— సంతతపవిత్రులు తమకు వేఱే స్నానమేల?

గిలి— ఆదుర్మార్గురాలు చిత్రాంగియొద్దకుఁబోయినందున నేనుం బ్రాయశ్చిత్తముం గొనివచ్చెదను.

సుబు—

గీ. వేసరనునందు ♦ విహరించు రాయంచ
విబుధవృక్షమునకు ♦ వెలయు చిలుక
మంచిచెలిమి యోడ ♦ కుంచిన చుక్కాని
ప్రాణహితునిఁ గావు ♦ సదావ్రతంబ.

సారం—

గీ. పరమహంస హృదయ ♦ పంజర శారిక
పద్మభూ దృగబ్జ ♦ షట్పదంబ
నన్నుఁగన్నతండ్రి ♦ నాలుకవాసించి
యిపుడు నన్నుఁగావ ♦ వేసునీతి.

గిలి—

గీ. అమ్మ నూకాలయమ్మ పో ♦ లమ్మ పైఁడి



యమ్మ యల్లమ్మ యాకిరమ్మ ♦ యాటలమ్మ
యమ్మ మరిడమ్మ తప్పుపా ♦ త్ర్యమ్మతోడ
దొడ్డికి నంటింతగుల్ల నో ♦ రొక్కవమ్మ.

(అందరు నిష్క్రమింతురు.)

ప్రదేశము;— చిత్రాంగి యంతఃపురము.

(అంటింటి విసరుచుండఁగాఁ జిత్రాంగిపాడుచుఁబ్రవేశించును.)

సావేరి— త్రిపుట.

ప॥ అయ్యయ్యో నావిధి - యందరాని పండునా
శాసించి మోసపోతినే - యేమిసేతు నే॥ అ॥

౧. వియ్యాలు విధముల - వేఁడినఁగరఁగక
చయ్యన ననుబాసెనే - యెంతచేసెనే॥ అ॥

౨. కలికివలచిన వన్నె - కాఁడువారకన్న
వలరాజలుక హెచ్చెనే - నిల్వనిచ్చెనే॥ అ॥

౩. మెలపునఁ గౌఁగిలికి - మించి వాతెఱవానునన్
బలిమిని విదలించెనే - తా నేమనుభవించెనే॥ అ॥

౪. చిలుకలు రోదచేసెనే - పూఁదోఁటలోఁ గో
యిలలు కోయని కూసెనే। తెలియనట్టులమర్మములనంటిముద్దిడునం
దొలగించి గద్దించెనే - నాయునుసులు గాంచెనే॥ అ॥

అంటి— అమ్మా! మీరు సెలవిచ్చినట్లే మీయుసురు దాఁకి యతఁడెట్లు బ్రతుకును? పెద్దప్రభువుగారిపుడతనిం జంపించుటకై కొల్వుచావడి కేగుచున్నారు.

చిత్రాం— ఎంతవేఁడికొన్నను వినక నన్నింతదుఃఖ పెట్టినాఁడు తనకు జయమగునా? ఇపుడు తననీతినిల్చునో? నానీతినిల్చునో?

పెద్దప్రభువు వానినిఁక బ్రతుకనీకుంట రూఢి. వానికొల్వు చావడికి వెడలినారాయేమి?

అంటి— చిత్తము. తమసెలవుప్రకారము పురోహితునిచేఁ దమపక్షముబలపర్చుమని యూసపెట్టిపంపినాను. ఈపాటికందఱుం గొల్వుచావడికిఁ జేరవచ్చును.

దౌవా— (ప్రవేశించి) అమ్మా! యంటింతం దమవైపు సాక్ష్యమిచ్చుటకు రమ్మని సెలవైనది.

చిత్రా— సరియే. అంటింతా! నీవుపోయి యీకార్యముం జక్కఁజేసికొనిరా. వానికదేశాస్తి.

(అంటింత దౌవారికతో నిష్క్రమించును.)

చిత్రా— (తనలో)

గీ. నడుసముద్రములో దిగ ◆ విడిచినట్లు
కొండచీఁకటి నూతిలోఁ ◆ ద్రోసినట్లు
లయ్యెవారలని వలచిన ◆ యతఁడు లేక
నాకుమాత్రము దుఃఖపుం ◆ దనువిదేల?

కాని మోహముతగదనివిదల్చినాఁడు, వానితప్పేమున్నది. మొదటనాకుమాట్లాడఁబడినవాఁడు, ప్రధానముజరిగినది, ఆసవాళ్ళంపుకొన్నాము. ఇట్టిహేతువుల వలన వానింగోరినాను. నాతప్పేమున్నది? ఉన్నపుడిద్దఱియందుండవప్పులున్నవి. నాతప్పునకేమిగాని వాఁడంతచక్కనివాఁడేలఁగావలయును? వానియందదేతప్పు. మొదటనన్యోన్యముం బ్రేమించిమధ్యనువిఘాతమువచ్చి యిట్లీరువురము చచ్చుటకు విధివ్రాసెను. నావంటి వలచినదానిఁ గాదన్న సారంగధరుఁడు చచ్చుట న్యాయమే.



అయ్యో! మనసున్నవాఁడు కట్టుకొనకపోయె. కట్టుకొన్నవాని పైమనసు కుదురదాయె. స్త్రీలనాథలుకదా? కార్యముమించిపోయె నిఁకనావెఱ్ఱిరాజు వానిం జంపుట రూఢి. కన్నెతనము నుండియు వానిపైఁబ్రాణముపెట్టుకొన్న నాకొకసారిమోవియిచ్చియైనం దుష్టిపొందించక విదల్చిపోయినాఁడుగావున వానికిఁ దగినశాస్తి యిఁకనేస్త్రీకిని నేవలచిన దేహమొప్పగించకుండఁ జంపఁబడుటయే. మఱియునింత చదువు చదువుకొనియువేల్పువంటి సారంగధరునిం జంపించిన నాకు తగిన శాస్తి యీవజ్రపుపొడిమ్రింగి చచ్చుటయే. మాయిద్దఱికింతయే దేవుఁడువ్రాసినాఁడు. (అనివిషముతోడి వజ్రపుపొడిమ్రింగి) యిఁకచీఁకటిగదికిఁబోయి సుఖించెద. రమ్మ మృత్యువా నీవునాకురుచించినట్లు మఱెవ్వరికిందోఁచఁబోవు. నాకుసారంగధరునిపైఁ గల్గుమోహమున్యాయమని లోకమెఱుంగనీ. ఒకసారి నాముద్దులసారంగధరునిం బాడుకొని తుదిహాయి పొందెదను.

పున్నాగతోడి— చతురశ్రగతి.

ప॥ సారంగధరుఁడా నిను - జేరంగవలెనన్ని-
జన్మములకైనఁ - జచ్చియైన॥ సా॥
అ. మారసమాకారా నుకు - మారసాధువిచార।
సారసదళనేత్ర బుధ - స్తవనీయచరిత్ర॥ ముద్దుసా॥
౧. గానకవితాలోల - కమనీయవాగ్జాల।
దీనజనపరిపాల - తేజోవిశాల॥ సా॥
౨. శరదిందు మందహాస - శాశ్వతకీర్తివిలాస।
స్మరహారనామాభ్యాస - మామకచిత్తవికాస॥ సా॥

గీ. బొందిరో వానిబొందిలోఁ ♦ జెందఁ గలయము
డెందమా వానిడెందము ♦ నందుడిందు
ప్రాణమా వానిప్రాణమై ♦ యలరుచుండు
వాని సారూప్యమిప్పుడు ♦ నేమగందు.

(నిష్క్రమించును.)

ప్రదేశము— కొల్వుకూటము.

(మంత్రి మొదలగు పరివారము పరివేష్టించియుందురు.)

రాజు— (ప్రవేశించి, తనలో)

గీ. పుత్రుడన జోఁగలేక క ♦ శత్రిమునకు
నోరఁగఁజాలక నామోహ ♦ ముండె నిపుడు
తుల్యభారంబు లిరుఁదట్లఁ ♦ దూఁచుచున్న
త్రాసువకుఁగల్గుఁ ముల్లువి ♦ ధంబుదోఁచు.

ఆపని యట్లుజరుగునా ? జరిగియుండ వచ్చును. వింతలేని యూవులింత పుట్టుటెట్లు ? మొదట నేర మెవరిదై యుండును ? చిత్రాంగిదా లేక యాదుర్మార్గునిదా? నాయనుభవముఁ జూచుకొనెదను. పురుషులకుఁగలతత్త్వపాటు స్త్రీలయెడఁగాన్పించదు. స్త్రీహృదయము చాఁపక్రిందినీరువంటిది. మొదటఁబురుషులే వెలితిపడెదరు. స్త్రీలకెంతకామమో యంతయోర్పును భయమును దేవుఁడుంచనియెడలలోకములో మఱిహద్దుండునా ? పాతివ్రత్యము. ఆహా! యిదిస్త్రీలు దక్కించుకొనుట దుస్తరముకదా ? పాతివ్రత్యము, దేవుఁడు- ఈ రెండును శబ్దమాత్రములేకాని యనుభవములో లేవుకాఁబోలును. ఆహా ! యీదుర్మార్గుఁడంతఃపురమునకుఁబోవనియెడ నింతరాదుకదా ? పోనీ సొగసైనవాఁడును మొదటఁదనకు మాటలాడఁబడినవాఁడు నగానఁజిత్రాంగియే తొలుత దుర్బుద్ధిపుట్టి వానిఁ బిలువనంపనీ వాఁడక్కడికేలఁబోవలెను. చదువుకొన్నవాఁడేమో, యౌవనవంతురాలియొద్ద కొంటింజనరాదనివివేకమెఱుఁగలేఁడా ? మఱియెక్కడిచదువు, మఱియెక్కడి వివేకము. కామాంధకారముచేఁగన్నులుపొరలుగ్రమ్మి యింతయుఁజేసినాఁడాపతితుఁడే. నానిశ్చయము చిత్రాంగి పతివ్రత యబద్ధమేలచెప్పును ? ఆదుర్మార్గునికిఁ దల్లివంటిది- తల్లివంటిదేమి తల్లియే. అగ్నిహోత్రసాక్షిగా నేఁబుస్తెగట్టినది. నాకడుపునం జెడఁబుట్టినాఁడాపాపాత్ముఁడు వానినింకస్మరించఁగూడదు వానిముఖమైనం జూడఁగూడదు. (ముక్కునవ్రేలిడికొని) తల్లింబల్మి చెఱపట్టుట ? (గుండెమోఁదుకొనుచు) ఎంతసాహస మెంత ఘోర మెంతయపకీర్తి. పాపాత్ముఁడా! నన్నైననాలోచించినావుకావా? అయ్యో! నిష్కల్మషమైన పాండవవంశమున కెంతమచ్చవచ్చెను? ఆహా! రాజై పుట్టుటకన్నఁబాపముకద్దా ? మాబ్రతుకు లోకమునకంతయుందేటతెల్లమే. నిన్న నేయీఘోరముజరిగెను నేఁడిప్పురియెల్లవ్యాపించినట్లు తెలియవచ్చెను. సర్వేశ్వరా! రత్నాంగి గొడ్రాలు కారాదా? పితృద్రోహియగువానినేలపుట్టించితివి? (కోపమున) కానీ యీదుష్టుఁడు తనపాపమునకుఁ దగుఫలమనుభవించును. వాదమెట్లున్నను, సాక్ష్యమెట్లున్నను నాద్రోహిచంపఁబడవలసినదనియే నానిశ్చయము. (గద్దెపైనిగూర్చుండి) న్యాయకర్త

యింక విచారణ ప్రారంభించునది.

మంత్రి— ఉభయవాదులపక్షపు న్యాయవాదులును, సాక్షులును, ప్రతివాదియు సిద్ధముగా నున్నారా?

భటుఁడు—న్యాయవాదులును వాదిగారిసాక్షియు సిద్ధముగనున్నారు. అదిగో! ప్రతివాదిగారును వారిసాక్షులునువచ్చుచున్నారు.

సుబు— (ప్రవేశించి. తనలో)

సీ. ఇతరుల మనసు నొ ♦ ప్పింపఁడేకరుణావి
శిష్టుఁడు తనకెంత ♦ చేటైన
చోద్యమునకైనయ్యుఁ ♦ జూఁడఁడే ధృతిశాలి
పరకాంతఁదానెంత ♦ సరసుఁడైన
అఖిలజనంబుల ♦ కడఁకువఁ జూపునే
విజ్ఞాని తా దొర ♦ బిడ్డఁడైన
తెలియని యట్టులఁ ♦ దిరుగు సత్తత్త్వ వి
ఖ్యాతిఁ దా సర్వజ్ఞ ♦ మూర్తియైన
అట్టి నాప్రాణహితుఁడు స ♦ త్యవ్రతుండు
పురుషులకైన సమ్మోహ ♦ కరుఁడు సింహ
సకరియుండక్కటా దోష ♦ విరహితుండు
యితఁడు కష్టంబుపడఁ జూచి ♦ యెట్టులోర్తు.

క. ఒకపుస్తక మొకబండియు
నొకఫలహారంపుపాత్రి ♦ యొకశయ్యయు ము
చ్చికలోఁ గడపిన విహితుల
మకట యిపుడు వేఱు బాధ ♦ లందఁగవలసెన్.



ఆహా! నేఁడెంత దుర్దినము? త్రిలోకశూరుఁడు, ఆజన్మపరిశుద్ధుఁడు, పాండవకుల పవిత్రుఁడు, నాకుంబ్రాణమిత్రుఁడునగు సారంగధరప్రభువు మృషాపవాదనుబట్టి శిక్షవిధింపఁబడునేమో? సకలనీతి కోవిదులును, నాస్నేహితుని సత్యవర్తనంజిన్ననాటినుండియు నెఱింగినవారునగు మాతండ్రిగారు న్యాయకర్తగానుంట యొకగొప్పమేలే. తుదకెట్టులైనను రాజాజ్ఞనుబట్టికదా తీర్పుండును. నేనెఱింగినసంగతి సాక్ష్యము చెప్పెదను. (కూర్చుండి) సత్యము ప్రోవదా

గిరి— (ప్రవేశించి)

తోడి—చతురశ్రగతి.

ప॥ ఎందుకురా పెండ్లి యెందుకురా॥ ఎందు॥
అ॥ అందకత్తెగ – య్యాలి పెండ్లామైన।
నద్దాని మూరెట్టి – పెద్ద మగండైన॥ ఎందు॥
౧. నీరసించిలేవ – నేరక శంకించి।
కోరచూపులుచూచి గ్రు – క్కుళ్ళుమ్రింగుటల॥ కెందు॥
౨. పుట్టతల ముగ్గు – బుట్టవలె నెఱసి।
నట్టేటిలో నావ – యట్టులున్నవాని॥ కెందు॥
3. నూఁగుమీసము వాండ్రు – నోరూరఁగాఁజూచి।
యాఁగలేని జవ ♦ రాలి నునుఱుపెట్టు॥ నెందు॥

గీ. ఉత్తముఁడు పెండ్లియాడక ♦ యున్నవాఁడు
మధ్యముఁడు గ్రుడ్డిదానితో ♦ మన్నవాఁడు
యధముఁడందముగలదాని ♦ నంటువాఁడు
ముసలిపెనిమిటి యధమాధ ♦ ముండగాఁడె.

ఈపాడంటెంత చిన్నప్రభువుపై నేరము మోపుటకెంత నిబ్బరముగా నిలువఁబడెను? తలక్రిందు చేయఁబడినదివిటీవలె నీవెట్టి రాజముఖము దించఁబడియు నగ్నిజ్వాలల నెగిరించుచున్నది. అదిగో! దిబ్బపురోహితుఁడు లంచము మెక్కి వాదించుట కెంతదిట్టముగాఁ బొట్టనిమురుకొనుచున్నాఁడు?

భటు — గిలిగింతా! కదలక మెదలక నిలుచఁబడు మిది ధర్మస్థానముసుమా? అదిగో! ప్రతివాదిగారు వచ్చుచున్నారు.

సారం — (ప్రవేశించి తనలో)

గీ. ఎవఁడు ప్రభువనఁ దగివాఁ ◆ డెవనియిచ్ఛ
కడ్డులేకుండు నెవఁడు స ◆ త్యస్వరూపుఁ
డాదికారణ మెవ్వఁడీ ◆ యఖిలమునకు
నట్టిసర్వేశు నేనిపు ◆ డాశ్రయింతు.

నాముఖముఁ జూచుట కసహ్యించి కాఁబోలు మాతండ్రిగారు మాఱ్మొగము పెట్టుకొన్నారు. హరహరా! విధియిట్లుండెను. అదిగో! మహాకవి గాయకశిరోమణి నన్ను నిరపరాధిగాఁ జల్లనిదృష్టితోఁ గాపాడవిచ్చేసెను. ఆచార్యులగుట వీరికి నాప్రకృతి విశదమే. సత్యహృదయముతో హాయిగ నాతండ్రిగారియాజ్ఞ కొడిగట్టెదను.

రాజు — విచారణ ప్రారంభించవలయును మంత్రీ! యాలస్యమేల?

మంత్రి — వాదిగారి వాఙ్మూలము. సకలధర్మస్వరూపులైన న్యాయకర్తగారి సముఖమునకు, వాదిచిత్రాంగిదేవి దేవుఁడు సాక్షిగా మనవి చేయువిన్నపము:— ప్రతివాది నాసవతికొడుకు



సారంగధరుఁడు, నాభర్త పెద్దప్రభువువారూరలేని సమయము చూచుకొని నాయంతఃపురముం జొచ్చి నేనెంత మళ్ళించినను వినక దుర్మోహములో నన్నుబలిమిఁ జెఱబట్టినాఁడు. కనుకఁ బ్రతివాదికిఁ బద్ధతి ప్రకారము తగిన శిక్ష విధించుటకై ప్రార్థించుచున్నాను.

రాజు — వినుట కెంతకర్ణకఠోర మెంతయపకీర్తి?

మంత్రి — అంటింతా! నీవేమెఱుఁగుదువు?

అంటి — దేవునిపైఁ బ్రమాణ చేసి చెప్పుచున్నాను. వాదిగారి వాఙ్మూలమంతయు నిజమే. ప్రతివాదిగారు వాదిగారిని బల్మి చెఱబట్టినప్పుడు నేదగ్గర నేయున్నాను.

మంత్రి — వాదిగారి వాఙ్మూలముపైఁ బ్రతివాదిగారేమి చెప్పెదరు? దోషులని యొప్పుకొనెదరా?

సారం — నేదోషిని గాను.

రాజు — ద్రోహిం సత్యమెట్లొప్పుకొనును?

మంత్రి — ప్రతివాదిగారి మొదటిసాక్షి యేమి తెల్పఁగలఁడు?

సుబు — ప్రతివాదిగారును నేనును పావురముల నెగిరించుచున్నప్పుడు, ప్రతివాదిగారి పావురము వాదిగారి మేడపైని వ్రాలెను. ప్రతివాదిగారాపావురమును దీసికొనిరమ్మని యీ గిలిగింతనంపగా, వాదిగారు 'తల్లియొద్దకుఁ గొడుకు వచ్చుట కేమియభ్యంతరము, ప్రతివాదిగారినే రమ్మనుము' అని సెలవిచ్చినట్లు గిలిగింత చెప్పగా వింటిని. పిమ్మట వాదిగారి మేడకుఁ బ్రతివాదిగారేగిరి. నేనంతట మాయింటికిఁ బోతిని.

రాజు— వీఁడును వాఁడును దొంగదొంగలే.

మంత్రి— గిలిగింతా! నీసాక్ష్యమేమి?

గిలి— పాపము పాపము. పుణ్ణెము పుణ్ణెము.

మంత్రి— పెక్కులు పేలెదవు? ప్రమాణముచేయుము. దేవునియెదుట—

గిలి— ఏఁడీ దేవుఁడు నాకగపడినఁగాని వానియెదుట నెట్లు ప్రమాణము చేయుదును.

రాజు— ఓరీ నీవెఱింగినది తిన్నగఁబల్కు కాకున్న నిన్ని పుడు నఱికించెదము,

గిలి— నేనెఱింగినసంగతియే దేవుఁడు నాకగపడలేదు.

మంత్రి— వాదిగారు నీతోఁబ్రతివాదిగారిని రమ్మనిచెప్పినారా?

గిలి— లేదు.

రాజు— అదిగో నిజము తేలినది.

మహా— వాదిగారుగాక మఱెవరైనంజెప్పినారా?

గిలి— వాదిగారి తో తో తోఁక యీ యంటింతగుల్ల చెప్పినది.

మంత్రి— అంటింతా! వీనితో నీవు చెప్పినావా?

అంటి— నిన్న వీఁడు నాకగపడలేదు.

మంత్రి— వాదిగారి మేడపైఁబ్రతివాదిగారి పావురము వ్రాలినదా?

అంటి— వ్రాలినది. దానినమ్మగారు నాచేఁబట్టించితమ



యొద్దనుంచుకొన్నారు.

మంత్రి— ఉంచుకొని యేమిచేసినారు?

అంటి— నాచేతికిచ్చి ప్రతివాదిగారి కిమ్మన్నారు.

మహా— వాదిగారి కాపావురము ప్రతివాదిగారిదని యెట్లు తెలిసెను?

అంటి— దానికొఱక గిలిగింతవచ్చినప్పుని.

గురు— తొందరపడకు. భయపడకు మంటింతా! బాగుగ జ్ఞాపకము తెచ్చుకొనిచెప్పు.

అంటి— నిజమునకు భయమేమి? బంగరు టందెలంబట్టి, యీపావురము చిన్నప్రభువుగారిదని యెవరెఱుఁగరు?

మంత్రి— వాదిగారి యాజ్ఞచొప్పున ప్రతివాదిగారికాపావురము నిచ్చివైచితివా?

అంటి— నేనిచ్చుటకుఁ బోవునంతలోఁ బ్రతివాదిగారేవాదిగారి మేడయొద్ద నాకెదురైనారు.

గిలి— (తనలో) అమ్మ నీనెత్తిగొట్ట. పచ్చియబద్ధమాడితివే

మంత్రి— ప్రతివాదిగారొంటిగ నెదురైనారా?

అంటి— ఒంటిగానేమి? యీగిలిగింతకూడ వెంటనున్నాఁడుకాఁడా?

మహా— నీవేమైన గిలిగింతతో మాట్లాడితివా?

గురు— న్యాయకర్తగారి చిత్తముగాని, ప్రతివాదిగారి న్యాయవాది యనవసరప్రశ్నము లడుగుచున్నాడు

గిలి — నీకిదియవసరమా పాడుబాపఁడా? నీయిల్లునిండినది లే?

అంటి — గిలిగింతనాతోఁ బావురమునకై వచ్చినానన్నాఁడు.

మహా — గిలిగింతవచ్చిన యెంతసేపటికి ప్రతివాదిగారు నీకెమ్మరైనారు?

గురు — అదిగో యదిగో యిటువంటి ప్రశ్నములింకనుమానఁడు.

అంటి — అడుగనిందు భయమేమి? ఎంతసేపటికా? పావుజామునకు.

గురు — ఈసాక్షికి మతిపోయినది. న్యాయకర్తగారీమాటలు వ్రాయరాదు.

మంత్రి — గిలిగింతా! ఇదినీతో నేమిమాట్లాడెను?

గిలి — ఈమగామిడిపండ్లు కావలెనాయని యడుగలేదా? ఏమోచీరకొంగు ముడిచూపించి పోనీ యెందుకనలేదా?

అంటి — (స్వగతము) అయ్యో! మఱచి యుత్తరమిక్కడికే తెచ్చినాను?

రాజు — సాక్షివిచారణలైనవి. ఇంక నెవరిన్యాయము వారుపల్కునది?

గిలి — ఇంకొకటిమాత్రము మిగిలిపోయినది. బల్మిచెఱకు శస్త్రవైద్యుని సాక్ష్యమక్కఱలేదా?

రాజు — నోరుమూయుము? వెఱ్ఱివాఁడవనిక్షమించినాము

మహా —

గీ. [illegible]పరాధిగ సారంగ ♦ ధరునిఁగంటి



సారం —

సత్యహృదయంబుతో తల్లి ♦ జాడఁగంటి

సుబు —

చిన్నప్రభు వీశ్వరుండని ♦ చెప్పుచుంటి

గిలి —

వెఱ్ఱికీలోకముం బలు ♦ విధములంటి.

గురు —

గీ. వింతలేని యావు ♦ లింత నేరమిట్లు

మహా —

భ్రమసికలను త్రుళ్ళి ♦ పడినయట్లు

గిలి —

తార్పుగుల్ల చక్క ♦ దనమగపడు నెట్లు

సుబు —

హితుఁడు హితునివిడక ♦ యేగినట్లు.

మంత్రి — సారంగధరప్రభువుగారు సుబుద్ధికిం బ్రాణమిత్రులగుట.

రాజు — ఇద్దఱుం దొంటిదొంగలే.

సుబు —

గీ. తోటిదొంగ లిరువుర మే ♦ ల్పాటుజంట

మహా —

తల్లిపిల్లలవలె భేద ♦ మొల్లకొంట

సారం —

పాలసంగతి మన్ననఁ ♦ బడయుకుంట

గిలి —

గుల్లయంటింత తారుపు ♦ చెల్లదంట.

గురు— సత్యమో కల్లయో తలిదండ్రులకు రిత్త విరోధము పుట్టునా?

మహా—

గీ. సత్యమేకల్ల కల్లయే ♦ సత్యమిపుడు

సుబు—

మిత్రులం దాగ్రహార్థము ♦ మీఱెనిపుడు

సారం—

తల్లియంచాత్మలో ధృతిఁ ♦ దాల్చెనపుడు

గిలి—

గుల్లయంటింత తారుపు ♦ చెల్లెదపుడు

గురు— బుద్ధికి దేహధర్మములోఁగినను తనవయసుమితి మీఱినయెడఁ బాపరతుల శాస్త్రవాసన లడ్డనేరవుగదా?

రాజు— మాతృద్రోహి పితృద్రోహుల కేశాస్త్రము?

మహా—

గీ. విబుధులకునైన శక్యంబె ♦ విధినిదాట

సుబు—

తల్లిపిల్లల కీడంబు ♦ తగులుచోట

సారం—

కల్లగాఁబోదు మీపంబు ♦ గలుగునోట

గిలి—

గుల్లయంటెంత చెప్పిరా ♦ పొల్లుమాట.

గురు— ప్రతివాదిగారు నూతన వయోవంతులు గదా? విద్వాంసమపక్షపాతి యనుమాట పొల్లువోవునా?



మహా—

ఉ. లోఁగనివాఁడె విద్దియల ♦ లోనఁ గిరీటి దుగాను రాగికిన్

జోఁగనివాఁడె సత్యమున ♦ సూటి

సుబు—

హితవ్యతిరేక వృత్తితో

నేగక యుంటపాటి

మహా—

చలి ♦ యింపనిమేటికి మోహమేటి

గిలి—

వే. వేగురుచెప్పినన్ వినని ♦ వెఱ్ఱి నిజంబెఱుఁగంగ నేటికిన్.

రాజు—

గీ. మనలఁగూర్చి జనములను ♦ కొనెదరెట్లు

మహా—

కల్ల సత్యంబుగా శిశు ♦ చెల్లినట్లు

గురు—

తల్లిపిల్లలలోఁగీడు ♦ తగిలినట్లు

గిలి—

లంచము న్మ్రింగి నేరంబు ♦ పెంచినట్లు.

మంత్రి—నాకుందోఁచిన తీర్పిదిగో ప్రభువులకు మనవిసేయుచున్నాను. (1) వాదిగారి వాఙ్మూలమును ప్రతివాదిగారొప్పుకొనలేదు. (2) అంటింతయొకమాఱు గిలిగింతంజూడలేదనియు, మఱియొకసారి చూచినానుగాని మాటాడలేదనియుం జెప్పుటచే దానిసాక్ష్యము వ్యత్యస్తముఁగా నున్నది. (3) మఱియుం బావురము న్వాదిగారు పట్టించి తమయొద్ద నుంచుకొని

గిలిగింతనచ్చిన పావుజాముపటురును జాగుసేయుటచే వాదిగారే ప్రతివాదిగారి రాకకభిలషించినట్లు స్పష్టమగుచున్నది.

మహా— నాకుందోఁచినమట్టు ప్రతివాదిగారు రాజన్మ పరిశుద్ధులు నఖండ విజ్ఞానులు. పురుషులకునైన మోహనాకారు లగుటచే వాదిగారే ప్రతివాదిగారిం బిలిపించి బల్మిఁ బట్టుటకుయత్నింపగాఁ బ్రతివాదిగారు విదల్చుకొనివచ్చినట్లు నందుపై వాదిగారు పగసాధించుకొనుట కిట్లు పన్ని చెప్పినట్లుం గాన్పించుచున్నది.

సారం— (స్వగతము) ఆహా! మహాకవి గోయకశిరోమణి కన్న వేఱే దైవముకలఁడా?

గిలి— నాయూహా యిూడు జోడుకుదిరినచిన్న ప్రభువుగారు చిత్రాంగి రాణిగారును బెండ్లికై మొదట నేర్పాటుఁజరిగిన తరువాత నీముసలిగా జాపెను వలచి కట్టుకొనుటవలన నింత వచ్చెను.

రాజు—(స్వగతము) వీఁడు వెఱ్ఱివాఁడైనను వీనిమాట లాలోచింపఁదగినవి.

గురు— పెండ్లికై తన్ను వాదిగారు కోరుకొన్న సంగతినెఱింగియు నన్యథాకట్టఁబడినయట్టి వాదిగారి యంతఃపురమున కేనెపముతోనైనం బ్రతివాదిగారుచొచ్చుటయే యతనియందుఁగల దుష్టోద్దేశమును వెల్లడిసేయుచున్నది.

రాజు— సరియే. మానిశ్చయ మీద్రోహి తనతప్పొప్పు



కొనకున్నను మాపరోక్షము సందుచూచుకొని చిత్రాంగియే బల్మిపెట్టిన యపుడీద్రోహియెట్లు విదల్చుకొనిరాఁగలఁడు. తా విదల్చుకొని వచ్చినట్లు ప్రజ్ఞసూచించుచున్నాఁడుగదా

గీ. మత్తెపుం జిఱునవ్వు మొలక ♦ లెత్తుచుండ
చీఁకటి మెఱపు వాల్జూపు ♦ చిమ్ముచుండ
కులుకుగుబ్బల పయ్యెద ♦ కొంగుజార్చి
బల్మిపెట్టెడి జవరాలిఁ ♦ బాయఁదరమె.

మఱియు వీఁడంతఃపురమున కేగుటయే తప్పు. న్యాయకర్త యొక్క తాత్పర్యముతో మేమేకీభవించము. ప్రతివాదియిందుపైఁ జెప్పవలసినదేమైనం గలదా?

సారం—

గీ. పెనుతపంబుచేసి ♦ కని పెంచి చదువు చె
ప్పించి మేటియర్థ ♦ మొంచి మిగుల
వృద్ధిఁగోరు తండ్రి ♦ యొద్దిశాసించునో
దానిఁదప్పవలెనె ♦ తనయునకును.

గీ. సాము చదువులందు ♦ సంతోసమున నన్ను
[illegible]రులు నువ్వి ముద్దు ♦ గొనెడి తండ్రి
యిపుడు సత్యమెఱుఁగ ♦ కిట్లల్కఁజూపుట
మిత్తికంటె నాకు ♦ మేటి శిక్ష.

రాజు— (స్వగతము) హరహరా! సర్వేశ్వరా!, యిటుగోయి యటునూయి యెంతద్రోహియయ్యును గన్నకొడుకునెట్లు శిక్షింతును? మఱియు శిక్షింపకున్న నన్నుఁగక్కుఱితిరాజనిలోకములోనిందించరా? ఏదియెట్లైనఁగానిమ్ము శాశ్వత

ధర్మభంగముసేయ నేర? (ప్రకాశము) నీపాండిత్యము చాలున్ పితృద్రోహీ. గురుభట్టారకా! యేశిక్షకు వీఁడు పాత్రుఁడగును?

గురు — పితృద్రోహికిఁ గాలుసేతులు దెగఁగొట్టించవలయు నని శాస్త్రము.

రాజు — ఏవండ్రా యాలస్యముసేయక యీద్రోహికిఁ గాలుసేతులు నఱికి వేగమిటురండు. మీవార్తకై యిచటనే యెదురుచూచుచుందుము. ఇంతతో మాకీయపకీర్తి తొలఁగెను.

(సారంగధరుఁడు ముఖముకప్పఁబడి హంతకులతో నిష్క్రమించును.)

రాజు — గురుభట్టారకా! హంతకులు ద్రోహిమరణవార్త మాకుఁ దెల్పవచ్చునంతలో మాహృదయశాంతికై యెద్దియైనం దెల్పుఁడు. (తెఱజాఱును)





శ్రీరస్తు.

# సారంగధర నాటకము

## పంచమాంకము.

ప్రదేశము — సింహద్వారప్రాంతము.

జబ్బన్న — (ప్రవేశించి, తనలో) ఏమన్యాయమే మన్యాయ మీలాగున్నది? వేల్పువంటి చిన్నప్రభువును జంపుటకుఁ జేతులెట్లాడును? చిత్రాంగిదుర్మార్గము రేపో నేఁడో పెద్దప్రభువునకుఁ దెలియకమానదు. పాపము దాఁగునా? పెద్దప్రభువవుడు తనయవివేకమునకు దుఃఖించు నింతయుసత్యము. గనుక నేను జిన్నప్రభువున్మ్రగుల్చుట పెద్దప్రభువునకును లోకమునకును సంతోషకరము. నాస్నేహితుఁ డదిగో గిజిగన్న నాకొఱకెట్లు పరుగిడివచ్చుచున్నాఁడో?

గిజిగన్న — (ప్రవేశించి) జబ్బన్నా! నిలువఁబడు నిలువఁబడు.

జబ్బ — చూచితివా నేస్తమా! యెంత ఘోరమో?

గిజి — ఘోరమా ఘోరమునకా? మఱియొకవింత. నేనిప్పుడే రంగుచీరలనిచ్చుటకుఁ జిత్రాంగిరాణియొద్దకేగితిని. ఆదయ్యము చీఁకటిగదిలోఁ దలుపు గడియపెట్టుకొని పండుకొన్నది.

గున్నము చెంత దాసులందఱు నేమోగడబిడ పడుచున్నారు. ఇంతలో నీసమాచారము తెలిసినిన్నుఁజూడవచ్చితిని.

జబ్బ— అదిగో రత్నాంగిదేవిగారు కాఁబోలును! కనికరము కన్నకడుపు చూడవచ్చుచున్నారు. రమ్ము మనముపోవుదము. నీవువేఱే చెప్పనక్కఱలేదు. నేనిదివఱకు నిశ్చయించుకొన్నదే యేమఱకుకాసిమ్ము.

(అనియిరువురు నిష్క్రమింతురు.)

హంతకులతో సారంగధరుఁడు ప్రవేశించును.

సారం—

శుభపంతువరాళి—రూపకతాళము.

ప॥ నీవేనాయాత్మకు శరణ - నిఖిలాది కారణ॥ నీ॥

అ॥ స్థావరముగఁ బుట్టింపక - కేవలతిర్యక్కుఁజేయ।
జీవనుమతి ననునరునిగ - నేలపుట్టించితివితండ్రీ॥ నీ॥

౧. సువివేకమే తప్పయ్యెను - సూనృతంబె ముప్పయ్యెను।
భువిఁబాతకి రక్షఁబొందె - పూతజనుఁడె శిక్షఁబొందె॥ నీ॥

హరహరా! సర్వేశ్వరా! నాకెంత దుర్గతిపెట్టితివి. నిదోషినగునాకుఁ బితృవిరోధము, మృషాపవాదము, ఘోరమరణము వ్రాసితివా? కానీ మించినది తలపోసి కుందనేల? అక్కటా! ప్రాణహితుఁడా!

చ. క్షణమెడఁబాసి నప్డు నినుఁ ♦ గన్నులఁజూచినదాఁకఁ దోఁచకుం
దుమగద రాత్రినాఁడు కల ♦ లో నినుఁదప్ప మఱెవ్వనింగనుం
గొనఁగద ప్రాణమిత్రుఁడవు ♦ కోవిదుఁడౌ నినుఁద్రోయుచేతు లి
ష్టనఘుఁడ శాప్తిఁ బొందెదను ♦ మయ్య నుబుద్ధిననుక్షమింపుమా.



గీ. అష్టపల్లి నిషీణియు ♦ యనుఁగుపారు
వంబ నామాటవినినంత ♦ వంగుబిల్ల
తత్వమెఱిగింపు భాగవ ♦ తంబు మిమ్ము
బట్టి నాకర్మములకీఁకఁ ♦ బ్రాప్తిలేద.

సీ. నాబిడ్డకన్న నుం ♦ దరుఁడు లేఁడని పారిం
బొరిమాఱి నొక్కి నన్ ♦ ముద్దుపెట్టి
నాయన్న జగదేక ♦ నాయకుఁ డగునని
మఱిమఱి నన్దన ♦ యురముఁజేర్చు
నాయయ్య చదువులో ♦ నంబోదయని పలు
మఱుచెంతఁజేర్చి నా ♦ కురులు దువ్వి
నాతండ్రి శాశ్వత ♦ ఖ్యాతి నొందునటంచు
నన్నుఁగన్నపుడెల్ల ♦ మిన్నుముట్టు
అట్టి ననుఁగన్నతల్లి నా ♦ యాపదవిని
యెట్లు భరియింపఁగల్గు నిం ♦ కెట్లుబ్రతుకు
హరహరా సర్వలోకేశ ♦ పరమసాధ్వి
నిట్లు గందింపనను సృజి ♦ యించినావు.

రత్నా— (ప్రవేశించి) హంతకులారా యాఁగుఁడాఁగుఁడు. నాచిన్నితండ్రి ముఖమైనం జూచుకొనెద. నాతండ్రిముఖమొక్కసారి చూపించిన నిదిగో నాల్గులక్షల చంద్రహారము మీకిచ్చెదను.

1 హంత— ఓరీ యొకమాఱు చూపింతమురా?

2 హంత— రాజుగారికిఁ దెలిసిన మనలఁజంపించరా?

1 హంత— ఘనము పిల్లలను గనలేదా? (తెఱదీయుచు)

పోనీ కన్నకడుపెంత యాసగనున్నదో ?

సారం — (తల్లినిఁజూచి) ఇదిగో నాయమ్మ. హారహారా! నాతల్లికెంత వ్యథపెట్టితివి ?

రత్నా — (సారంగధరునిఁ గౌఁగిలించుకొని) అయ్యో నా తండ్రీ! ననుఁగన్నతండ్రీ నేనెందుకు బ్రతికియున్నాను? నాసవతికి నీయుసురెట్లు తాఁకునురా ? నాయన్నా నీముఖముదృష్టి తగులునేమోయని కన్నారనిన్నెన్నఁడుం జూడలేదురా? నీకొఱకెన్ని నోములు నోచినానురా ? నీసుగుణము లెన్నియని తలంచుకొందునురా ? ఇఁకనెందుకు మొజ్జవలె నేనెట్లు బ్రతికి యుందురా ?

సారం — అమ్మా! పుట్టినవానికి మరణమెన్నిటికైనం గలుగకతీఱదు. నా చావునకు విచారించనుగాని నాయయ్యకు సత్యముం దెలియనేరకుంటకు శోకించెదను. అమ్మా యింతతో మనకు ఋణముచెల్లెను దివ్యజ్ఞానవంతురాలవు నీకు నేఁ దెలుపఁగలనా? సత్యహృదయముతో నీకొడుకు మృతినొందుటకు నీవు సంతోషమునొందవలసినదే సెలవిమ్ము.

రత్నా — నాతండ్రీ నాచక్కనియన్నా నాకడుపెట్లు భరింతునురా ? నాసుగుణపుంజమా యిఁకనన్నెవ రమ్మాయని పిలచెదరురా ? ఇఁక నిన్నెందు వెదకెదనురా ? (మూర్ఛిల్లుచు) కొడుకా కొడుకా !

హంతకులు — ఇఁక నాఁపవాటముకాదదిగో మననాయకుఁడు వచ్చుచున్నాఁడు.

(సారంగధరునితో హంతకులునిష్క్రమించఁగా తెఱజాఱును)



ప్రదేశము — కొల్వుకూటము.

(రాజు, మంత్రి, సుబుద్ధి, మహాకవి, గణికలు మొదలగు పరివారము.)

రాజు — మంత్రీ!! [illegible] ?

సుబు — ఇంతసేపా ? [illegible]

రాజు — ఇంతతో [illegible] ?

గణి — ఆఁకలి వేళగావచ్చెను. ([illegible]) అదిగో [illegible] ?

మహా — (యోచించిచూచి) [illegible] ? [illegible] ([illegible])

రాజు — [illegible] ?

మహా — [illegible] !! [illegible] ?

గణి — [illegible] ?

రాజు — [illegible] ?

మహా — [illegible] —

రాజు— ఏమిచెప్పుమా? విప్పిచదువుఁడు.

మహా— (విప్పి) నవమన్మథుఁడైన సారంగధర ప్రభువుగారికి సేవకురాలు చిత్రాంగిరాణి—

రాజు— ఆశ్చర్యమాశ్చర్యమా పైని?

మహా— వ్రాసికొన్న విన్నపములు—

గీ. తావిగల మేల్మిబంగరు ♦ తరుసవాఁడ
కందెఱుఁగని నిండువెల మొ ♦ గంబువాఁడ
దొడ్డబేడిసమీల కం ♦ దోయివాఁడ
విన్నపంబిదె వలచిన ♦ వన్నెకాఁడ.

ద్విపద. అనవాలంపిన ♦ యది మొదల్నిన్నుఁ
గాన నూరుచునుండెఁ ♦ గదర వాకన్ను
ఈఁడుజోడుల మన ♦ మిద్దఱమున్న
పోఁడిమెఱిఁగియు నన్ ♦ బోడవేనీయన్న
వామెడకుంగట్టు ♦ నాటినయట్టు
నామదికిన్ లేదు ♦ నమ్ము నాగుట్టు
తరలివచ్చెదమన్నఁ ♦ దప్పదీబోను
మఱినిన్నుఁ గనుకోర్కె ♦ మానఁగలేను
నిదురెఱుంగని కలల్ ♦ నిన్ గూర్చివచ్చు
పదనుములుక్కుల నన్ను ♦ వలరాజుగుచ్చు
గడియలు యుగములు ♦ గాపాఁగుచుండె
పిడుగు చందమునఁ గో ♦ వెలమ్రోఁగుచుండె
వేఁడుచుందాయె నీ ♦ నేస్తంబుగూడ
నోడక వేగ ర ♦ మ్మోవన్నెకాఁడ



కాటుక కన్నీటఁ ♦ గలిసినవ్రాలు
నీటుగ రమ్మని ♦ నిన్ బతిమాలు.

రాజు— చాలు నేదీ (ఉత్తరమందికొనిచూచి) ఔనౌను. మాకుబాగుగఁ దెలియునీవ్రాఁత యాదుర్మార్గురాలిదే? (కత్తి యంటించితలనిడి) అంటెంతా! ఇప్పుడు జరిగినదంతయునిజము రానీ. సారంగధరుఁడు దోషియా? యీయుత్తరము నీకెట్లువచ్చెను?

అంటి— చిన్నప్రభువుగారు దోషులుకారు మహాప్రభూ!

రాజు— హరహరా నేనెంతపాపాత్ముఁడ నెంతకఠినుఁడను?

అంటి— ఇది చిత్రాంగిరాణిగారువ్రాసి చిన్నప్రభువుగారి కిమ్మని నాచేతికిచ్చినారు. మహాప్రభూ! కూటికొఱకుఁ జేరిన దాననుగదా? యూపెచెప్పినట్లువినకున్న నాతలనిల్చునా? ఇపుడునిజ మొప్పుకొనక విధిలేదు. నన్నుఁ గాపాడెదమన్న మనవి చేసెదను. చిన్నప్రభువుగారు తమ పావురముపై నాసతోఁ జిత్రాంగిరాణిగారిమేడచెంత నిలువఁబడినన్నుఁ బావురముందీసికొని రమ్మని చెప్పఁగా నామాట నేనుజిత్రాంగిరాణిగారికి మనవిచేసినాను. పిమ్మట నాపె నన్నతనిఁ దోడితెమ్మని పంపించెను. అతఁడు నేనంతఃపురమునకు రానేల? పోనీతల్లిగదా తప్పేమనిచిత్రాంగిరాణియొద్దకు రాఁగా నాపె యతనితో నల్లిబిల్లి మాటలాడి తనతోరమ్మని బల్మిపెట్టినందుకతఁడొప్పక విదల్చుకొని పోయె నందుకుఁబగసాధించుకొనుటకై యూపెమీతోనిట్లుపావముకల్పించి యింత చేసెనుగాని మహాప్రభూ చిన్నప్రభువుగా

తెలియనేరక శిశువి ♦ ధించుకొంటి
నకట విపరీతదైవము ♦ నడ్డఁ దగమె.

(నిష్క్రమించును.)

మహా—

గీ. తమ్ముమాలిన ధర్మంబు ♦ తగదఁటంచుఁ
దలలనలరించు తమమొద ♦ ఘలము గావఁ
బూని చాఁచిననీడల ♦ మునుఁచుకొనిగొఁ
బాదపంబుల నడుమింట ♦ భానుఁడొప్పె.

(అనియందఱు నిష్క్రమింతురు.)

ప్రదేశము— రత్నాంగి యంతఃపురము.

(రత్నాంగి విచారించుచుండ వలవంతియుపచారము చేయుచుండును.)

రత్నా— అయ్యో నాకొడుకో కొడుకో, నాముద్దుతండ్రీ నాప్రాణధనమా నాబంగరుకొండా నానాయనా నామదపుటేనుఁగా నాకేమిదారిరా? నేనెందుఁజొత్తునురా? చక్కనినాన్నా నీకైయెన్నినోములునోఁచితినిరా నేనెందఱివేల్పులకు మ్రొక్కితినిరా (తలమోఁదుకొనుచు) సర్వేశ్వరా నాబిడ్డనిఁగాపాడవా?

వల— (చేతులుపట్టుకొని) అమ్మా! యోర్చుకొనుఁడు బలవంతముగాఁ జచ్చిపోయెదరా?

రత్నా— వదలు వదలువలవంతా! నెబిగ్గరగనేడ్చెదను నే మోఁదుకొనెదను, నేఁజచ్చిపోయెదను. నాఱెక్కలుపట్టుకొనకు మీచేతులతో వానినేనెత్తుకొంటినిగదా? నాతండ్రియేఁడీ నా సారంగధరుఁడేఁడీనానరప్రసాదియేఁడీ నా సత్యవ్రతుఁడేఁడీ?



ఏందుంటివిరా కొడుకా! నన్నమ్మాయని యింకపిలువవా నా కనులఁబడవా? నేనెన్నిదలఁచుకొందునే వలవంతా! నాతండ్రి పుట్టింటి దీపముకన్న నెక్కువుగ వెలిఁగినాఁడే? చుట్టపక్కములింతచక్కనివానిం జూడలేదన్నారే? నేనేమి సేయుదు నే యీరాజీవము పోదాయెనే? అహా తండ్రీ! నీవునిరపరాధివిరా నాసవతికెంత దుర్బుద్ధిపుట్టెనురా? నాయన్నా నాచంటికూనా నాకగపడవా? నీతల్లినోదార్చవా? నీపావురముల నెగిరింతువురారా? నాతండ్రీనీవిల్లింకెవరు పట్టఁగలరురా? త్రిలోకశూరా యెంతచదువుకొన్నవాఁడవురా నాయన్నా యెంతసత్యసంధుఁడవురా నాబిడ్డా యోయయ్యా యోరినాన్నా పలుకవా? నీయమ్మపై నీకలుకవచ్చెనా! నామాటకునీవెన్నఁడుంజవదాఁటవుకదా! గొడ్డుదేవుఁడు నిన్నే వెదకెనా? నాతండ్రీ నీతండ్రికిసత్యము వోఁచదాయెనా? ఆమృత్యుదేవత నాసవతియెంత పన్నికపన్నెనే వలవంతా! నీకాళ్ళు పట్టుకొనెదనే వలవంతా! నాచిన్నితండ్రిని నాకగపర్చవేవలవంతా! ఏమిసేయుదునేవలవంతా! నాప్రాణముపోదాయెనే వలవంతా! (మూర్ఛిల్లుచు) యెంతపనిజరిగెను?

వల— ఏమీవిధి యెంతఘోరము చూడవలసి వచ్చెను? రత్నాంగిదేవి మూర్ఛిల్లెను. కనికరమీపెనుదు రుబ్బినెత్తురు చిమ్ముచున్నది. పన్నీరుచల్లిన సేదదేఱునేమో?(పన్నీరుచల్లుచు) అయ్యో!యీమెబ్రతుకదుకాఁబోలును? నన్నుఁబ్రాణమువలెఁ జూచునదింక నాకెవరుదిక్కు?

రక్షించుఁడు రక్షించుఁడు.

రాజు — (రుమాలుతో కన్నులొత్తుకొనుచు) ప్రాణేశ్వరీ! నేనేమిచెప్పఁగలను? నేనేమిసేయుదును? పాపాత్ముఁడను హంతకుఁడను. మనబిడ్డఁడు నిరపరాధియఁట? నిష్కారణముగ నా దుర్మార్గురాలిమాటవిని వానిం జంపించితిని. హరహరా! విధి యిట్లుండె.

రత్నా — నాకొడుకో కొడుకో నీతండ్రివచ్చెను రాచూడ రా నీతలిదండ్రులనోదార్చరా ప్రాణేశ్వరా మనబిడ్డఁడు నిరపరాధిగదా చంపఁబడెనా? మఱిమనయొద్దకురాఁడా మనకంటఁబడఁడా?

రాజు — ఆహా తండ్రీ! యెంతపరాక్రమశాలివి యెంతసత్యసంధుఁడవు? నిన్నూరక చంపించినందుకేమనుకొంటివో నేనెంత ద్రోహుఁడ నెంతమందదృష్టవంతుఁడను? దుష్టచిత్రాంగితనపాపమునకుఁ దగునట్లనుభవించెనుజుమా నాయనా యిఁకనిన్నెట్లుచూడఁగలనయ్యా నీతలిదండ్రులునీకై పలవించుచుంటిరెందుంటివి రాతండ్రీ!

రత్నా — (తనలో) అయ్యో నాప్రాణనాథుఁడెంతదుఃఖించుచున్నాఁడు. నేనింకనీతనినోదార్చనియెడలఁగీడుమూఁడును. నాకొడుకుకన్నను మఱియు నీమూఁడులోకములకన్నను నాభర్తయేకదా నాకెక్కుడు? (ప్రకాశము) ప్రాణేశ్వరా! సరియా ధర్మమా స్త్రీలవలె తాముంగూడశోకించెదరా? మనము తొల్లి యేపాపముచేసికొంటిమో యిట్లుకట్టిఁడిపెను. విధివ్రాలుతప్పశ



క్యమా? యాచచ్చిననాసవతివలన నింతయయ్యెను.

రాజు — ప్రాణేశ్వరీ! యీయిద్దఱిచావునకును నీకింతదుఃఖమునకును నాయవివేకమేకారణము? నేనింకబ్రతికి యీఘోరశోకమున్సహింపఁజాల నయ్యో పుత్రకా!

సీ. కాంక్షతో దీనుఁ ♦ గాచు దయాశాలి
వక్కటా యుంటివే ♦ దిక్కుమాలి
సుకుమార జగదేక ♦ శూర నిష్కారణం
బేనిన్నుఁగాల్లవ ♦ చించినాన
సతత మందస్మితాం ♦ చిత ముఖకమలప
డున్నావ జంతువుల్ ♦ నిన్ను నముల
కలనైనఁగల్లవ ♦ అక్కనితండ్రివంచు ని
న్నెంచకూరక నటి ♦ కించిసాన
నిరపరాధివి పుత్రకా ♦ నిన్నుఁజంపి
ధర్మమెఱుఁగక లోకనిం ♦ దలకోడియిడి
దక్కియుండిన నాదేహ ♦ మక్కటకట
నిన్నుచిక్కిన వరికన్న ♦ వ్యధయుఁగాద.

ఇంక బ్రతికి యీఘోరశోకమున్సహింపఁజాల నిక్కత్తికి నాజీవనముబలియిచ్చి సుఖించెదను.

రత్నా — వలదువలదు ప్రాణేశ్వరా! మేటిధైర్యశాలురగు తామిట్లు జాలిఁగుందఁదగునా? విధికృతమెంతటివారికిం దప్పనగునా? మించినది తలంచవలదు చూఁడుడు. ఆఁడుదానను వానింగన్నతల్లిని నేనుఁగూడ సైచుకొనఁగఁ దామిట్లు దిగులొందనేల నాత్మహత్యమిగులదోషము లోకములోనపకీర్తి. ఎవరిగ

తికి వారేకారణము. సారంగధరుని మృతికిఁ దానుకారణమని తలంచఁదగదు.

రాజు—

గీ. ఓర్మిగొన కర్మ్యమున్ లాగు ♦ చున్నకొలఁది
పెదుకురెట్టించి విచ్చల ♦ విడియగాఢ
మంచుఁ దనరాతుతో మప్పుఁ ♦ జొందుగుత్తి
మటుల నాశోకమింతతో ♦ నాఁగఁబోదు.

భటు— మహాప్రభూ! యేలినవారి దర్శనమునకై చిన్నప్రభువుగారింగొంపోయిన హంతకులువచ్చియున్నారు.

రాజు— హరహరా సర్వేశ్వరా!

గీ. అడవిలోపల నడురేయి ♦ యందుకారు
గ్రిమ్మ యాకస్మికముగ బెం ♦ గాలిఉవ్వ
వానఁ గొఱడువాటిన ♦ వానిమీఁదఁ
బిడుగువలెఁ బుత్రమృతివార్త ♦ విందునేమొ?

రత్నా— అయ్యో నన్నుఁగన్నతండ్రీ నాచంటికూనా నీవుస్వర్గమందుంటివా యింకనీకొరకై దప్పికలులేవా? సుకుమారమైన నీయొడలు నేలకప్పగించితివా? నాకొమరుకా కొమరుకా.

హంత— (ప్రవేశించి) సజీవులై చిన్నప్రభువారున్నార తెని కేయపాయమును లేదు.

రాజు&రత్నా— సంతోషము సంతోషమెంతధన్యులము? మాతండ్రియేఁడీ యెప్పుడుచంపుటమానినారు నిజమే నిజమేనా ఇహా దేవుఁడెంత మంచివాఁడు?



హంత— మహాప్రభూ! సంశయించవద్దు హాయిగాఁజిన్నప్రభువారు బ్రతికియున్నారు. తమకొక్కరికేఁదప్పఁబట్టణమంతటికినిఁజిన్నప్రభువుగారు నిర్దోషులని విస్పష్టముగఁదెలిసియున్నది. మానాయకుఁడు మాతోనిన్ననే యీనిజముచెప్పినాఁడు. చిన్నప్రభువుగారు మమ్మెన్నోవిధములఁదమ్ముఁజంపుమని బల్మిపెట్టినారు కాని చూచిచూచి చంద్రునివంటి యాతనిఁజంపుటకుఁ జేతులాడను. మాయదృష్టమ్మున నింతలో సత్యము తనంతటనేబయలుపడెను. గనుక నిబ్బరముతో నేలినవారి కీక్షేమవార్త దెలుపవచ్చితిమి. మమ్ము రక్షింపవలెను.

రాజు & రత్నా— మీరు హంతకులు కారు మావాలిటి వేల్పులు. ఏఁడీమాయన్న?

హంత— ఉత్తరపుటడవి పూఁదోఁటలోఁ దాముండెదమని యాఁ దమతల్లిగారికిని సుబుద్ధికిని దమయునికి తెలియపర్చుమనియు సెలవిచ్చిపోయిరి.

రాజు— సరియే మీకందఱకు నాల్గువేలు బహుమతి యిప్పించెదము లెండు. మంత్రీ! కని, మహాకవిగాయక శిరోమణికీ క్షేమవార్త సెప్పి తక్షణమే యిటకురమ్మనుము.

హంత— చిత్తము. (నిష్క్రమింతురు.)

రత్నా— జీవితేశ్వరా! దేవుఁడెంతటి కరుణాసముద్రుఁడు మంచువలె నంతశోకము మాయమయ్యెంగదా? నాతండ్రిని [illegible]

రాజు — ఔను నిజమెఱుంగుటకు మానవుఁడనెంత? ఆహా! సత్యస్వరూపుఁడగు పరమేశ్వరుఁడుంట యెంతస్పష్టము?

గీ. మునుపు నీటిలోన ♦ మున్గియూపిరియాడ
కున్నకూడ్కి నిజము ♦ నొందుమనకు
నిపుడు పైకిఁదేలి ♦ నసగిదిసంతోష
మరయఁ బరమసాధ్వి ♦ హరునికృపము.

రత్నా — నాతండ్రిన్నాకనులారఁజూచువఱకును నాకు నమ్మకములేదు. ప్రాణేశ్వరా కటాక్షించి విచ్చేయవలయును.

రాజు — సంతోషమే ప్రాణేశ్వరీ! నగరునలంకరింపించి సమస్తపరివారముతో మఱియు నేగుదము. దేవుఁడనుగ్రహించినాఁడు మనకేలోటంతయును లేదు. అదిగో యీవార్త తెలిసి కాంబోలు సంతోషముతో గిలిగింతపాడుచునాడుచు వచ్చుచున్నాఁడు.

గిలి —

ఏకతాళము — బ్యాగురాగము.

ప॥ చిన్నప్రభువుమాకదక్కె మాకేమికొఱఁత-
గొరా- చెల్లెక్కపిల్ల నీవాటనేఁటాట॥ చి॥
౧. కౌరయొండ గాయక నా- ర్యుండవేగఁబోరా-
మా- చందురునఁపించరో॥ పారిగారిమారిగపామగామరిగసా॥ చి॥
౨. నేరమెంచవట్టి కల్ల - మారిసమగ్రోలె।
నిక- నిజముమాకుఁ దెలె॥ చిన్న॥

గీ. ఆఁకలింగొను కడుపున ♦ కన్నమువలె
గొఱ్ఱువాటిన మేనికిఁ ♦ గుంపటివలె
దుసదగొను చెఱకిందూడి ♦ తిరిపుగింది



మీకుఁజెప్పుదునాయొక ♦ మేలువార్త.
పెద్దప్రభువుగారికిఁ బెద్దనేను నమస్కారము.

రాజు —

గీ. నాదుప్రాణధనమ్ము నా ♦ మోదపదము
నాదుబ్రతుకునఁ వెనెల ♦ నాదుకనులఁ
గన్నపుప్పారుకూపు నా ♦ యున్నబ్రతికి
యున్నవార్త చెప్పలవిఁదు ♦ నోపరుచుదువా.

క. మిన్నునెగబ్రాకి స్వర్గము
గొన్నటు సంపూర్ణశక్తి ♦ కొమరారినటుల్
చిన్నన్న క్షేమవార్తకి
వెన్నెన్నో జోకతీఁగ ♦ లేపుంజూపెన్.

పెద్దనీవననేమిరా?

గిలి — మునుపటికంటె పరకంత్రైనం బెఱుఁగలేదా నాకు బుద్ధి.

గీ. కానికోఁకలబర్వరా ♦ కాసితిండి
గాడిపసు నాయమాదల ♦ కీఁడిబదులు
గోరుమంగలి కన్యాయ ♦ మూరునట్టులు
బూటకపుఠార్పుగుల్లకుఁ ♦ బుసవుపత్రై.

రత్నా — నాయన్న యెందుండెనురా?

గిలి —

కాఫీ — ఖండగతి.

ప॥ కుడిగొడమలఁదిరిగిప్రొద్దా నాక- వడికిసత్యము గాయపద్దా।
ఉడుకుబోతంటెంతబద్దాదాని- కుండెరాయొక పెద్ద।

ఊఊ మఱిచిన్న ఈఈ— అదెవడికెనాఁడు నాయన్న॥ కు॥

౧. మిన్నుముట్టుచుఁగల్గసౌఖ్యముఁబగ— గొన్నయమ్మిక్కిలి నన్నుమెక్కుఁ।

గన్నతల్లికిఁ బెంపెక్కుమా— చిన్నప్రభువుమాకునిక॥ కు॥

౨. గాలివంటిదినాదుమాటయెల్ల— కంపులింపుఁగనైచుచైట।

మేలుచేయూరేని పూఁట— మాలాపు నీవాలు నేపాట॥ కు॥

ఉత్తరపుటడవి పూఁదోఁటలో బోయతప్పించెబ్బులిచలేఁజిన్న ప్రభువుగారున్నారఁట చూచినట్టేచెప్పినారఁట. దధిగిణథోం.

రాజు—ఓరీగిలిగింతా! నీవుమాకుఁబ్రాణమునంటివాఁడవు కోరుకొను మెద్దియైననిచ్చెదము?

గిలి— ప్రభువులుకనుకఁగోరుకొమ్మనెదరు సరే యీమేడ నాతలకెత్తఁగలరా?

వల— మహాప్రభూ! అదిగోమంత్రిగారును మహాకవిగాయకశిరోమణిగారును వచ్చుచున్నారు.

రాజు— గిలిగింతా! సారంగధరునియొద్దకు రత్నాంగిదేవియుందలముతో నీవేగుము.

మహా—

గీ. ముందువలె భూరిసంతాప ♦ మందనీక
యిప్పుడొడలికిఁదొడవగు ♦ నెండవగిది
చేలికాఁ గన్నుఁగవయందు ♦ నింపుమీఱు
చుండెఁ బుత్త్రిలు మాకు నే ♦ తోత్సవముగ.

రాజు— మంత్రీ! మహాకవిగాయకశిరోమణీ నేఁడునాకు వ్యాధిపోయినట్లాయెదుర్మార్గురాలుసంతటంతా నేచచ్చెను. మఱి



యముబోయినజీవమువచ్చినట్లు సత్యసంధుఁడగుసారంగధరుఁడు మనకుదక్కె మనమెంతటియదృష్టవంతులము.

మంత్రి— మహాప్రభూ యేలినవారి యాజ్ఞానుసారముగ నగరెల్లయు నలంకరింపఁబడెను.

రాజు—సంతోషమురండు చిన్నవానిఁజూచికొనివత్తము

(అందఱును నిష్క్రమింతురు.)

ప్రదేశము— ఉత్తరపుటడవిపూఁదోఁట.

(సారంగధరుఁడు పాడుచుప్రవేశించును)

జంఝూటి—త్రిశ్రగతి.

ప॥ అగపడవేలరామా - యయ్యాలోకనాయకా।
జగంబులఁగన్నతండ్రీ - సాధుసౌఖ్యదాయకా॥ అగు॥
౧. నేసెచటం గానరా - నిన్నుసత్యమందుఁదప్ప।
గానలోలా వేవేగఁ - గావరా రామాయప్ప॥ అగు॥
౨. దేహమోహమూఢ్చరా - దివ్యజ్ఞానమీరా।
యోహో సర్వేశ్వరా నీ - యున్కి బయలుసేయరా॥ అగు॥

ఉ. కారణకారణంబ త్రిజ ♦ గత్ప్రభునా సకలాంతరాత్మ సం
సారవిదూర ఘోరకలు ♦ షఘ్న దయాంబుధి సర్వజీవనా
ధార యశోవిహార విభు ♦ ధస్తవనీయచరిత్ర భక్తమం
దార మహేశ్వరా నిజము ♦ దాఁచక తెల్పర నాదుతండ్రికిన్.

హంతకులు నేనెన్నివిధముల బోధించినను వినక నన్మిగిల్చినారు. ఆహా సత్యము హంతకులకుఁ గూడఁ జేయులాడ నీలేదు. నాపనియింకేమికాఁవలఁనియున్నది? అయ్యగారితో హంతకులు

నామృతివార్తఁబొంకెద రంతతో నాయయ్యకును మఱేయునా దుష్టచిత్రాంగికిని సంతుష్టియగును. కటా! విధి నాజీవితకాలములో క్షణమైన నొంటిపాటెఱుఁగని నాకిపుడెంతపట్టె. రాజే బీద బీదయేరాజు. స్థితులు కట్టుపత్త్రములవంటివి. ఇదిగో నేనిపుడు ప్రతిజ్ఞసేయుచున్నాను. మాతండ్రిగారికొకవేళ సత్యము తెలిసి నన్నుఁబిల్వనంపినను నేనింక రాజస్థానమొల్లకుంటరూఁషి. ఈమీఁద నేకాకినై యన్యతదోషమెఱుఁగని వనంబులఁ గ్రుమ్మరుచు సర్వేశ్వరుంబాడుచు నాత్మారాముండనై విహరించెద నది గో ప్రాణమిత్రుఁడు సుబుద్ధికన్నుపండువైనచ్చుచున్నాఁడు. ప్రియమిత్రుఁడా (కౌఁగిలించుకొనుచు) ఓహో సర్వేశ్వరుఁడు దయాసముద్రుఁడు?

సుబు— నేనెంతయదృష్టవంతుఁడను. తిరిగి యేలినవారిం జూచుభాగ్యమబ్బుననుకొనలేదింతయు సత్యస్వరూపుఁడగు సర్వేశ్వరునికృపకదా? తాము నిరపరాధులని పెద్దప్రభువుగారికి విశదమైనది. ఆదుష్టచిత్రాంగి యదేమో కాని విషముఁద్రాఁగి చచ్చెను. తమ్ము హంతకులు విడిచినందుకుఁదమతండ్రిగారపారామోదమంది యిపుడు సపరివారముగా మిమ్ముఁ దోడ్కొన వచ్చెదరు.

సారం—నాబ్రతుకుకన్న నాకెక్కుడు సంతోషము మయ్యగారు నన్ను నిరపరాధిగాఁ దెలిసికొనుటకదా? సుబుద్ధీ! నేనింకఁ బురము జొరనొల్లక వనంబుల నాత్మారాముండనై విహరింపఁ బ్రతిజ్ఞఁబట్టినాఁడఁజూమా?



సుబు— ఆహా పరమేశ్వరా! యేలినవారు సత్యసంధులు. ప్రతిజ్ఞతిరుగనొల్లరు. నేనుమిమ్ము విడిచి క్షణమైన బ్రతుకఁగలనా మీతలిదండ్రులిదివిని యెటులైచెదరు? తామెంతపని తలంచినారిట్లు తగునా?

సారం—ప్రాణమిత్రుఁడా! వినుము. నాకుఁ బెండ్లిగాక ముందేస్త్రీస్వభావముస్పష్టమైనది. ఇఁకనిట్టిదుష్టసంపర్కముతో సంసారకూపములోఁ జెలిసి యుంబడనేల? ఈశ్వరునిం బాడుచు దోసమెఱుంగని వనంబుల నింక మిగిలిన కాలముం బుచ్చ నిశ్చయించితిని.

సుబు— తామిట్లు నిశ్చయించినపుడు తమ తలిదండ్రులు గూడ నీకరాజ్యమొల్లక వానప్రస్థాశ్రమము గైకొంటరూఁషి. మఱియు నేనుఁగూడసిద్ధుఁడనై యేలినవారనాశ్రయించెదను. భోగములందునాకుఁగూడ విరక్తియొదవెను. వలయునపుడు సంసారముత్యజించుటకై చిరకాలముక్రిందటనే నాతలిదండ్రుల నొప్పించితిని. యిదిగో యీదలముపై మీతల్లిగారువచ్చుచున్నారు నేనీపొదచాటునుండి తిరిగి దర్శనము చేసెదను.

(నిష్క్రమింతురు.)

గీతి—

ఉత్తరదేశ భైరవి— ఏకతాళము.

ప॥ గుల్లరా యింటింట- గుల్ల పెంకెజెల్లరా।
చాఁకిబల్ల- నాకునొల్లరా॥ గుల్ల॥
౧. ఉన్నది తంటరికమున్నది- యింటికిరమ్మన్నది।
కంటఁబడుమన్నది- యొంటిగాఁదాఁజన్నది॥గుల్ల॥

చ. నక్కరా చూపునఁజిక్కరా - పట్టితక్కరా మాయ।
తొక్కరా కల్లపొక్కరా - విసము గక్కరా॥ కు॥

ఓహో! చిన్నప్రభువుగారు స్వర్గస్థులాగున్నది. పాపు రమున్ను మాతోనొకసారి యెగిరింతమా? యదిగో మీతండ్రిగారు విచ్చేయుచున్నారు.

రత్నా — (ప్రవేశించి సారంగధరుని మోము ముద్దుగొనుచు) నాతండ్రీ మేమెంతయదృష్టవంతులము? తిరిగి నీవు నాకనులఁబడుదువనుకొనలేదు. నీవు నిరపరాధివని మీతండ్రిగారికి స్పష్టమైనది. పాపపు నాసవతి తనకుఁదానే విషముఁగ్రోలి చచ్చెను.

సారం — అమ్మా నాబ్రతుకుకన్న నెక్కుడు సంతోషము నాయయ్యకు నిజము తెలియుటసుమ్మా.

రత్నా — అవునయ్యా నాతండ్రీ నీవు వరప్రసాదివి సత్యసంధుఁడవని నేను మొదటినుండియు నెఱుఁగుదును. మీతండ్రిగారికిఁ గూడ నీయందెంతయో నమ్మకము. కనికరమూతసినసవా చచ్చిన నాసవతి యిట్లు చేయించినదిగాని, పోనీ యింతేను మనపాలిటి దేవుఁడే మనలఁగాపాడినాఁడు.

సారం — అమ్మా నీయట్టిపుణ్యాత్మురాలి కొడుకైనవాఁడెప్పటికిని దుష్టుఁడుకానేరఁడట్టినానికెన్న ంగీమువగులఁబోదమ్మా లుపుడు నేనొక నిశ్చయముచేసితిని. నాదొకకోరిక చెల్లించెదనన్న మనవిచేసికొనెదను.

రత్నా — అక్కటా నాచంటికూనా నీకడ్డా? కోరుకొను మెద్దియడిగిన నిచ్చెదను.



సారం — అమ్మా నీవు పార్వతీదేవివలె సర్వజ్ఞురాలవు చిత్తగించుము మీ ప్రపంచనటనము చర్వితచర్వణముగాఁదోఁచుచున్నది. ఎక్కడనో నీయట్టిపుణ్యాత్మురాలికిఁదప్ప సంసారమందఱికి దుఃఖభాజనము.

రత్నా — నాకుమాత్రముకాదా నాతండ్రీ సంసారమందఱికిని దుఃఖకరమే. చెప్పుమెందుకిట్లు వైరాగ్యము పల్కుచున్నావు నీవు పసికూనవుకదా?

సారం — అమ్మా సంపదలు మోహకారణములు. కాలకర్మము లెట్టివారికి నవశములు. కావున నేయతినై కాలముగడుపఁబ్రతిజ్ఞపట్టితిని. (పాదములపైఁబడి) తల్లీ నీవిందులకు సెలవునయ సేయకతీఱదు.

రత్నా — కట్టా నాపట్టీ నీవిట్టిప్రతిజ్ఞపట్టఁదగునా? మనవంశమునకెల్ల నీవొక్కఁడవేకదా యాధారము? పోనీ నాయనా నీవేలాగునైన బ్రతికియున్నావు. విజ్ఞానివి. నేనునీమార్గమునకడ్డురానేల?

నట — అదిగో పెద్దప్రభువుగా రెందఱితోనో విచ్చేయుచున్నారు.

రత్నా — నాతండ్రీ నీవేయాశ్రమమందున్నను నేబ్రతికియున్నంతవఱకు నాకంటఁబడుచుండవలెనుజుమా?

సారం — నేనందున్నను దఱచుగాఁదమపాద సందర్శనము సేయుచుందును. (రత్నాంగివలసెంతలు నిష్క్రమింతురు.)

గిలి— వందనముస్వామీ! నేనుమీశిష్యుఁడను. నాకుపదేశించరా? మనపాపములకుంగూడ యత్యాశ్రమమిప్పింతమా? ఓసుబుద్ధిగారూ! బావిలోనుండి తెలి బయలుదేఱుచున్నారా?

సుబు— నాకంతయు వినఁబడుచున్నది. పతివ్రతాశిరోమణులుగాన మీతల్లిగారు సెలవొసంగిరికాని యొకులకిట్లు పుత్రమోహము ద్రెంచుటశక్యమా? మీతల్లిగారు సాక్షాత్తుం బార్వతీదేవియౌటరూఢి.

సారం— అదిగో మాతండ్రిగారు (నిలుచఁబడి) యేలినవారికి నమస్కారము.

రాజు— తండ్రీ సత్యమెఱుఁగనేరకనీకొనర్చినయవజ్ఞతకు నన్నుమన్నింపుము.

సారం— ఏలినవారిని నేనుమన్నించుపాటివాఁడనా? ఇంతకుముందెల్ల నన్నుం బ్రాణపదముగఁజూచువారుకారా? విధివశమున ఁదల్లియనుకొని చనినందునకింతవచ్చెను.

రాజు— ఆదుర్మార్గురాలు తనకుఁదానే చచ్చెను. నీసత్యము నిన్నుఁగాచెను. వాండ్రు హంతకులుకారు మాపాలిటివేల్పులు. ఆహా సత్యము శిక్షనందదుకదా?

మహా—

గీ. సత్యమనునద్ది యానంద ♦ నిత్యపదవి
నిర్మలము సందియము బొంద ♦ నిదళయును



సుబు—

పాటిగనునద్ది మత్ప్రియ ♦ ప్రభుతెలుఁగున

గిలి—

నాటకంబెద్ది యంటింత ♦ బూటకమున.

రాజు— ఆహా సుబుద్ధివాక్కు. సత్యానందఫలభాక్కు.

మంత్రి— మహాప్రభూ! వరప్రసాదిగాన చిన్నప్రభువుగారికన్న సత్యస్థైర్యములులోకములోనెందైనఁగలవా?

సారం—

గీ. ఏమిదక్కు సుబుద్ధిలే ♦ కీనరునకు

గిలి—

వశతకుంజోగు నీవెట్టి ♦ వానరునకు

సుబు—

సుహృదులకు మేటివికలత ♦ ఁజూపుతెంపు

మహా—

కన్నవారికిఁలోఁబడి ♦ కన్నపెంపు.

సుబు—

శా. దక్కెన్ సత్యయశంబు

సారం—

సిద్ధగతియున్

రాజు—

♦ దక్కెన్ బుధస్తోత్రి

గిలి—

ము। ప్పెక్కెన్గల్లకుగుల్లకున్

మహా—

జనని పే ♦ రెక్కన్ జరిత్రంబులన్

రాజు—

బొక్కన్ దబ్బరనిండె

సారం—

స్నేహితులకు ♦ బ్బాగజూపె సంతోషమున్

సుబు—

జిక్కన్ పక్షి యభీష్టవస్తువులకున్ ♦ జీవంబుగల్పించుమన్.

రాజు— మహాకవిగాయకశిరోమణీ పిన్నయే పెద్ద.

మహా—

గీ. శాశ్వతప్రకృతిలోన నీ ♦ జంబుఁజూడఁ
బ్రాణితంబట్టి పిన్నగాఁ ♦ బోలుఁబెద్ద
పిన్నదీపంబు కాల్చియుం ♦ గన్నగుణము
గన్నయటు పిన్నలో బుద్ధి ♦ ఘనతఁజూపు.

రాజు— సత్యవంతునిముఖ మెన్నఁడున్నొలితిఁజూపుముకదా?

మహా—

గీ. నెనరు దిప్పదనము నోర్పు ♦ నిరసలతయు
నిశ్చలతయుఁ దిటస్థత ♦ నియమితగతిఁ
జెంగృత్స్నియా నశ్వరత ♦ మంచివాక్కు
సత్య సంతాన యోగ్యుల ♦ ఘనములివ్వ.

గిరి—

గీ. దొంగతనము సిగ్గు ♦ వెంగళితనమును
వగలు సెగలు పొగలు ♦ వంపు సొంపు
గొంకు కన్నెగవయుఁ ♦ గొంటెవన్నెలమాట
కల్లబొంకమున్ను ♦ నెంచుదు.



రాజు— మామనసు పక్వమైనది. ఇంక నీకుక్షింభరిత్వపు దంభము, న్యాయముగనుగొనం జాలుదుమనునధికారగర్వము. మోహామునకుఁగల యంధత్వము మాకుఁదేటపడినది. చర్విత చర్వణసంపదలిఁకనొల్లము. మహాకవిగాయకశిరోమణీ మంత్రి మేమువానప్రస్థాశ్రమముం గైకొందుము. చిరంజీవి సారంగధరుఁడు వయోవంతుఁడు. రాజ్యభారము వహింపఁదగును. శీఘ్రముగ మాయభీష్టము జరుగవలయును.

మంత్రి— ఏలినవారిం జిన్ననాఁటనుండియుఁ గనిపెట్టుకొనియున్న యీపెద్దసేవకునికింగూడ మనస్సు లౌకికంబులవిరక్తిఁ జెందె. నాబిడ్డఁడు సుబుద్ధి మంత్రిగానాస్థానంబున నియమింపఁబడఁ బ్రార్థించుచున్నాను.

గిరి— కవిగాయకశిరోమణిగారూ !. యింకను మీమనసు పక్వముగా లేదా ? మేడలు గోడలు కోటలు పేటలు బోటులు గోటులు సంతుష్టితీఱ లేదా? పొదలు తుప్పలు గుట్టలు పుట్టలు వర్ణింపఁజనరాదా నాకుంగూడ వైరాగ్యముబుకు చున్నది. వద్దన్నఁ బెండ్లియన్నట్లు నాకీపేఁడిభోగము లేల ?




మహా—

సీ. చిఱుతాలపై జిల ♦ జిలపాఱు సెలయేటి
నీటిపై లకుముకి ♦ దాఁటుచూచి
నానాట నలవాఁటు ♦ బూని మెల్లనఁ జేర
వచ్చుజింకల కూర్మి ♦ పాటు చూచి
[illegible]ఁగులఁ జెఱలాడి ♦ బెడిదపుటొడ్డుల

ఁబొలయించు నేనుఁగు ♦ పోటు జూచి
దుష్టమృగ్గొనుచు ♦ దొడ్డపులులతోడ
నాటాడు చెంచెత ♦ నీటు జూచి
వర్ణనము సేయుచున్ భూరి ♦ వనములందు
ఁబలురకంబుల పిట్టల ♦ పలుకులకును
స్వరముగట్టుచు ఁజెట్టుల ♦ పట్టులందు
ఁబద్యములువ్రాయు భాగ్యంబు ♦ పట్టునెపుడు.

రాజు— తండ్రి నీవు రాజ్యపాలనమును స్వేచ్ఛానుసారముగాఁ బూనునది.

సారం— ఏలినవారు కటాక్షించెదరేని నాదొకకోరిక.

రాజు— కోరుకొనుమెద్దియైన నీకడ్డా తప్పక చెల్లించెదను.

సారం— సంసారంబిఁక నొల్లక వనంబులసిద్ధగతినందుటకుఁ బ్రతిజ్ఞఁబూనితిని.

రాజు— సత్యసంధుఁడవు ప్రతిజ్ఞతీరుగనేర నక్కటా నీతల్లియిదివిని యెంతదుఃఖించునో? ఎందుకట్లు తలఁచితివి పరాచిన్న తండ్రీ? ఇంక రాజ్యమెవరు వహించఁగలరు?

సారం— మాతల్లిగారి సెలవిదివఱకే పొందితిని.

సుబు— (తనతండ్రిం జూచి) నాకిదివఱకమ్మయు మీరును జేసినవాగ్దానమిపుడు చెల్లించుకొనెద బిడ్డనింగటాక్షింపఁగోరెద.

మంత్రి— సారంగధర ప్రభువుగారు నీవును శరీరములు వేఱైయ్యును మనసులొక్కటియేయని యిదివఱకేస్పష్టము.



రాజు— మంత్రీ! సిద్ధగతికేగు పుత్త్రులను వారింపఁదగదు. మాకీచిన్నవాఁడు పుట్టకమునుపు చంద్రచూడుని దత్తతచేసికొనుట మీరెఱుంగుదురుకదా? అతనికిరాజ్యమప్పగించి యతనిప్రాణమిత్రుఁడగు మీపెద్దకొడుకు కార్యదర్శిని మంత్రిగా నియమించునది. సరియే బాలకులారా! చక్రవర్తులుగనుంటకన్న సర్వజ్ఞులగు సిద్ధులగుటగొప్పకాదా? మంత్రీ! యీవనమునందే మేమువానప్రస్థులమై యుండెదము. మహాకవిగాయకశిరోమణీ! మనయందఱికిట్టి వైరాగ్యసంపద గలుగఁజేసిన పరమేశ్వరునొక్కమొగి మనమందఱముంగలసిపాడి మఱియు సాయంకాలకృత్యముల కరుగుదము. (అందఱుపాడుదురు.)

సురట—మిశ్రగతి.

ప॥ సత్యస్వరూపా జగదేకదీపా– సర్వేశ్వరా మాకు సజ్జ్ఞానమీరా।
అ॥ స్తుత్యచరిత్రా శుద్ధవైరాగ్యంబు– నిత్యంబుకాపాడి నిశ్శ్రేయసమిమ్ము॥
౧. అన్నిలోకములకు నాధారమగుతండ్రి– సన్నుతముగ మోక్ష సంపదలీరా।
నిన్నువేఁడినాము నిఖిలాదికారణ– మన్నించినీభక్తిమార్గముచూపుమో॥స॥

(అందఱు నిష్క్రమింతురు)

భరతవాక్యము.

ఉ. వైరములేకయెల్లప్రజ ♦ వర్ధిలుగావుత విద్దెలెల్లఁ బెం
పారునుగాత సస్యమున ♦ న్యాయమతుల్ చరియింతురుగాత వే
పారి సమస్తధాన్యధన ♦ సంపదమీఱునుగాత యీశుఁడున్
స్వైరవిహార జీవనము ♦ స్వాశ్రితకోటికిఁ బెట్టుగావుతన్.

మంగళము

ముద్రితములగుచున్న

మద్విరచితగ్రంథములు

---

1. కాళీయమర్దనము (సంస్కృతమున హరికథ)
2. కంసవధ డిట్టో
3. పారిజాతాపహరణము డిట్టో
4. కాశీశతకము (సంస్కృతము)
5. యదార్థరామాయణము (6 తెనుగుహరికథలు)
   (1) శ్రీరామజననము.
   (2) సీతాకల్యాణము.
   (3) పాదుకాపట్టాభిషేకము.
   (4) శ్రీరామసుగ్రీవమైత్రి.
   (5) హనుమత్సందేశము.
   (6) సామ్రాజ్యసిద్ధి.
6. దంభపురప్రహసనము (తెనుగునాటకము)
7. ప్రస్తావక సంస్కృతాంధ్ర సంగీత పద్యప్రబంధ విశేషములు
8. నవరసతరంగిణి (షేక్స్పియరు కాళిదాసకవిత్వముల లోని విశేషముల కాంధ్రీకరణము)
9. శ్రీరామచంద్రశతకము (సంస్కృతము)

